నిజాయితీగల ఒక ఆఫీసర్‌కి అగ్నిపరీక్ష ! బాధ్యతగలమంచివాడికి సవాల్ !




నిర్మాతలు
దాసరి సత్యనారాయణమూర్తి
అల్లు అరవింద్ B.Sc

మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం
దాసరి నారాయణరావు

Ramu Arts

సోలడిస్ట్రిబ్యూటర్లు అనిల్ ప్రభాస్ ఎంటర్‌ప్రైజెస్

నవయుగ

VEEKAY

14–6–74

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక

# ఉత్తరాలు

సినిమా

31 5 74 సంచిక సినిమా శీర్షికలో "మనాలీ లోయ" సముద్ర మట్టానికి పధ్నాలుగువేల అడుగుల ఎత్తులో వుందని శ్రీనివాస్‌గారు రాసారు. కాని ఆ లోయ ఎనిమిది వేల అడుగుల ఎత్తులో వుంది. అది దాటిన తరువాత వచ్చే "లోహటోన" లోయ పధ్నాలుగువేల అడుగుల ఎత్తులో వుంది.

యం. యస్. వి. జి. రాజు, కటక్.

ముఖచిత్రం

31-5-74 "శ్రీ నాగేశ్వరరావు, లక్ష్మి" ముఖచిత్రంతో "ఆంధ్రసచిత్ర వారపత్రిక" మహా ఆకర్షణీయంగా ఉంది.

నెమలికొండ రంజన్, వి. గిరి,
సుమతి, సూర్యాపేట.

కథలు

ఎన్నాళ్లనుండో మీ పత్రిక నా మనస్సు నాకట్టుకొంది. ప్రస్తుతం నడుచుచున్న సీరియల్స్ "బంగారు కలలు", "మమతల వంతెన" రెండూ రెండు మణిపూసలు. ముఖ్యంగా 24-5-74 వార పత్రికలో కథలు నాకు బాగా నచ్చాయి. ముఖ్యాతి ముఖ్యంగా "పెళ్లికోసం" అనే కథ నన్ను బాగా ఆకర్షించింది. ఈ కథ ఈనాటి తల్లి తండ్రులకు గొడ్డలిపెట్టు వంటిది. అందరూ అంటే ఏమో చెప్పలేను గాని కొందరు తల్లి తండ్రులు మటుకు ఆ విధం గానే ఉంటారు. తమ కూతురు బాగా చదువు కోవాలి, ఉద్యోగం చేయాలి అని ఆశిస్తారే కాని, ఆమెకు ఒక మనసుందని, పెళ్ళి చేయాలని తలపే లేకుండా ఉండేవారికి ఇది ఒక గుణపాఠం నేర్పుతుందేమో !

కె. మాలతి, కాకినాడ






"బలమైన కథ రాసి పట్టుమ్మని సినిమా వాళ్ళు మొదటిసారి అడిగారు — బలానికి ఏదైనా మంచి టానిక్ రాసివ్వండి డాక్టర్ !"





# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)

శుక్రవారం : 14–6–'74
శ్రీ ఆనందనామ సం. జ్యేష్ఠమాస బ. నవమి

సంపుటము : 67 సంచిక 42.

స్థాపితం : 1908

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-3.

సంవత్సర చందా – రు. 31–20 పై.
ఆరుమాసాల చందా – రు. 15–60 పై.
విడి ప్రతి వెల 55 పైసలు


## విషయానుక్రమణిక

## చిన్నారి చిలిపిచేష్టలు:

మా మూడేళ్ల బాబు దేనికైనా పేచీపెట్టి బిగ్గరగా ఏడ్చినప్పుడల్లా, మా అయిదేళ్లపాప చిరాకుపడి "అబ్బబ్బ! ఎదవ, ఎప్పుడూ ఏడుపే! పాడుగోల! తలకాయ నెప్పి" అంటూ చెవులు మూసుకొని లేచి, దూరంగా వెళ్ళిపోతూ ఉంటుంది. మాబాబు ఏడ్చినప్పుడల్లా పాప, అలా అని దూరంగా వెళ్ళిపోవడం మామూలై పోయింది.

అ, ఆ లు, దిద్దుకోవడంలేదని, వాళ్ల నాన్నగారు ఒకరోజున పాపను కసురుకున్నారు. దానితో అది, ఏడవటం మొదలు పెట్టింది. దానిపక్కగా కూర్చుని ఆడుకుంటున్న మాబాబు, వాళ్లక్కవంక ఒక్క క్షణంపాటు అలాగే మాసి, ఏమనుకున్నాడో ఏమో, "అబ్బబ్బ...ఎప్పలూ ఏలుపే! తలకాఎప్పి!" అంటూ చెవులు మూసుకుని లేచి చక్కా పోయాడు.

తన మాట తనకే అప్పచెప్పినందుకు



మా పాపకు అంత ఏడుపులోనూ, నవ్వొచ్చి పకపకమంటూ నవ్వేసింది.

సి. లక్ష్మి నరసమ్మ. ధవళేశ్వరం

# హైదరాబాద్ నోట్‌బుక్

— తిరుమల రామచంద్ర.

### ఆవకాయ అధ్వర్యం

ముదురాకు పసరురంగు మామిడికాయలను ప్రాకృత మహాకవి వాక్పతిరాజు గౌడవధ కావ్యంలో పసుపుపూసుకున్న ద్రావిడసుందరి చెక్కిళ్లతో మాత్రం పోల్చాడు గాని, చార్మినార్ సమీపంలోని మామిడికాయలమండీని చూచివుంటే, తన కావ్యాన్ని మరెన్ని పోలికలతో నింపేవాడో! నాకుమట్టుకు ఆకాయలుచూచి, ఆవకాయగా దాని పరిణామం వూహించుకొని, నోట్లో నీళ్ళూరడం తప్ప మరే వూహా కలుగలేదు. మండీ ముంగిట్లో అడుగు పెట్టామో లేదో, మామిడికాయలు వ్యాపారంచేసే "పొరదానోళ్ళు" ఆడామగా మనచేతులు పట్టుకొని లాగుతారు "మాకైరీలు (మామిడికాయలు) మంచి గున్నవి. ఆవకాయగినవేస్తే ఆరేండ్లాను బరాబర్ తినొచ్చు.పొండి. అగ్వ. ఎక్వ తక్వ గిన్తిమంటే కైరీలన్నీ మీకే"అంటులాక్కుపోతారు. చప్పట్లుకొట్టి పిలుస్తారు. పచ్చల ముద్దలలాగవుంటే మామిడికాయలు ఎవరైనా ఆకర్షిస్తాయి. ఇక కాయలు పరికించడం, వాటిని బుట్టల్లోనింపుకోడం ఒక నాటకం, — సమతకారం, "ఒక్క వేటుకు నాలుముక్కల్. ముక్క సల్గి చూస్కోండి నల్గకుండా పనిసేస్తాం." అంటాడు ముక్కలు కొట్టే మనిషి. ఈ వ్యాపారంలో విద్యార్థులూ వున్నారు. 15 ఏళ్ల మునవార్ ఆలీ 9వ క్లాసు ప్యాసయ్యాడు. ముక్కలు నరికే పార్ట్ టైంజాబ్ చేస్తాడు. "ఇంకా చదువుతావా?" అన్నాను. "బి. కాం., అవుతాను" అన్నాడు "ఈ మాడికాలు కొట్కంలో ఏళ్ళు గిట్లా తెగ్తై" అంటూ కట్టుకట్టిన ఎడమచేయి చూపాడు. కాయ కష్టంపై గౌరవం, సెలవుల్లో పనిచేయడం ప్రతి విద్యార్థీ అలవాటుచేసుకొంటే ఎంతబాగుండును!

### సురభారతి భవనానికి శంఖుస్థాపన.

డాక్టర్ చింతామన్‌దేశ్ మే 19 న ఉస్మానియా విశ్వవిద్యాలయం స్థలావరణలో సురభారతి సమితి నూతన భవనానికి శంఖుస్థాపనచేస్తూ, "సంస్కృతం ముసలిదయినా, నవయవ్వన విలసితం" అనడంలో నిజం ఉందనిపిస్తుంది. విజ్ఞానశాస్త్రం పెరుగుతున్న నేడు, పాశ్చాత్యులకు గ్రీకులాటిన్లలాగ సంస్కృత ప్రాకృతాలు మనకు ఎంతగానోతోడ్పడుతాయనడం నిస్సందేహం, అంతమాత్రాన విదేశీపారిభాషిక పదాలను గ్రహించరాదనికాదు. ఈ శంఖుస్థాపన సమితి చతుర్థ వార్షికోత్సవంలో జరగడం, ప్రముఖ విద్వాంసులు శ్రీ కందాడై శఠగోపరామానుజస్వామి గారిని సన్మానించడం, శ్రీమతి మండలఅనసూయ కాళిదాసుపై వాల్మీకి ప్రభావం గురించి ప్రసంగించడం ఉత్సవ విశేషాలు.

### మహారాజరాజశ్రీ సంతాపం.

భారత ప్రభుత్వం మే 18 న అణుశక్తి పరీక్ష జరిపి, ప్రపంచ మహాశక్తుల సరసన కూర్చున్నందుకు ఎన్నోదేశాలు ఆశ్చర్యానందాలు ప్రకటిస్తే, రస్సెల్ అంతర్జాతీయ సంఘ కార్యదర్శి మహారాజశ్రీ "ఇది రస్సెల్ జన్మదినోత్సవంనాడు జరపడం విపరీతం, మానవతా ప్రేమికులకు, రస్సెల్ అభిమానులకు సవాలువంటిది" అని విమర్శించడం విచిత్రంగానే వుంది. బలమున్న వాని సహనాన్నే ప్రపంచం హర్షిస్తుంది. బలహీనుని సహనం అశక్తతగా నవ్వుల పాలవుతుంది. నేడు సోషలిస్టు దేశాలు నూతన సంఘవ్యవస్థను కాపాడుకొనడానికి ప్రజలసహకారంతో పాటు ప్రబలాయుధాల బలమూ కారణమే,రస్సెల్ సలహాను బ్రిటన్ పాటించిందా? కనుక భారత దేశం పని ఔపనిషదమైన, బుగ్వే ... వ్యవస్థను నెలకొల్పదలిస్తే ఆధునికబలం ఉండాలని, ఈ విషయంలో పాశ్చాత్యులతో పోటీపడక తప్పదని ఏ వేదాంతులయినా గ్రహించాలి.

### శ్రీమతి రాజ్యం సిన్హా.

రాష్ట్ర ప్రభుత్వ సమాచార ప్రజాసంబంధ శాఖ కొత్త డైరెక్టరు శ్రీమతి శ్రీరాజ్యం సిన్హా పూర్వపు డైరెక్టర్ల సంప్రదాయాలతోపాటు నూతన పద్ధతులను తమశాఖలో ప్రవేశపెడుతారనే ప్రతి పత్రికా రచయితా ఆశిస్తున్నారు. శ్రీరాజ్యం సిన్హా ప్రముఖ ప్రజాసేవకుడు శ్రీ అన్నె అంజయ్యగారి కుమార్తె కావడంవల్ల, శాంతినికేతనం విద్యార్థినిగా సంపాదించిన సంస్కారంవల్ల, 'మాతృభూమి' సంపాదకురాలుగా గడించిన పత్రికా రచనానుభవం వల్ల, సమాచార శాఖలో పొందిన రెండు దశాబ్దాల పరిపాలన నిర్వహణానుభవంవల్ల భగత్‌సింగ్ సహచరుడైన శ్రీ విజయ కుమార్ సిన్హా వంటి విప్లవకారుని అర్థాంగికావడంవల్ల, ఆమె నిర్వహించే శాఖ మరింత ప్రజోపయోగం కాగలదని ఆశించడం అడియాస కాదు, కాబోదు.

### ఉపశ్రుతి:—

"ఏమిస్వామీ,ఆంధ్రప్రదేశ్‌లో,దేవాలయాలు చాలవాటిలో ఆగమ శాస్త్రం ప్రకారం పూజావిధులు జరుగడంలేదని దేవాదాయ శాఖామాత్యులు రాజా శ్రీ సాగి సూర్యనారాయణరాజుగారు సురభారతి చతుర్థ వార్షికోత్సవం అధ్యక్షపీఠం నుంచి ప్రకటించారే. మీరేమంటారు?" అనడిగాను ఒక భట్టాచార్యులవారిని. "స్థలాభోగం, శిలాభోగం, జలాభోగం అని పెద్దలంటారు. ఆవిధంగా జనాగమమే — జనం రావడమే— ఆ పెద్ద ఆగమశాస్త్రం. ఆజనాగమం అనే దశ ఆగిననాడు ఏ ఆగమశాస్త్రమూ దేవాలయాలను ప్రజారంజకం చేయజా" అన్నారు ఆయన.

**సం**ధ్యా సమయంలోని పల్లె వాతావరణానికి ఏ మనిషైనా కొంచెం ఉత్సాహం చూపక ఆగలేదు.

ఇంటి వెనక పెరటిలో పారిజాతం చెట్టుని అనుకొని కూర్చుంది వత్సల.

అరుణ కిరణాలు చల్లబడి ఆకాశం నల్లబడుతోంటే పక్షులన్నీ తమ గూళ్లల్లోకి చేరుకోవటం, పశువులు ఇంటికి రావటం కనిపిస్తూనే ఉంది వత్సలకు. ఎటొచ్చీ ఏ గూడూ, నీడా లేనిది తనకి మాత్రమే.

బాధని మరిచిపోవాలనుకుని వచ్చి జ్ఞాపకం తెచ్చుకుని ఇంక బాధపడే ఓపిక లేక శూన్యం లోకి చూస్తూ కూర్చుంది. క్రమేపీ చీకటి చిక్కపడ్డది...

"అమ్మక్కయ్యా! ఇక్కడ కూర్చున్నావా?" ఇంట్లోనించి పరుగెత్తుకుని వచ్చి అడిగింది బిజ్జూ.

"చీకటిలో వచ్చావా? పదమ్మా లోపలికి..." చెల్లెలి కూతురిని హృదయానికి అదుముకుని లేచి నిల్చుంది వత్సల.

"నువ్వు కనిపించకపోతే వచ్చాను. ఈ చీకట్లో ఎందుకు కూర్చున్నావ్?"

"ఊరికేనే — పద." బిజ్జూని ఎత్తుకుని లోపలి వైపు నడిచింది వత్సల. కాని ఇంకా ముందుకు నడిచేందుకు కాలు ఆడలేదు. ముందు గదిలోనించి మఱిది — చెల్లెలు మాటాడుతున్న మాటలు వినిపించి అలాగే నిలబడి పోయింది.

"కూడు, గుడ్డ, నీడకోసం అక్కయ్య రాలేదిక్కడికి. నా కోసం, ఆత్మీయతకోసం



వచ్చింది. మీరూ, నేనూ వెళ్లి ప్రాధేయపడి అడిగితే వచ్చింది.'' ఇంకాస్సేపైతే ఏడిచేట్టు ముఖంపెట్టి అంటుంది వత్సల చెల్లెలు కిరణ్.

''అదికాదు కిరణ్ ! మనం ఉంటుంది పల్లెటూరిలో. వదినను తెచ్చి ఇంట్లో...'' భర్త మాటలు పూర్తిగాకముందే—''అవన్నీ అబద్ధాలండి. లోకం గ్రుడ్డిది. కాకుల్లా అలా అరవటం లోకులకి అలవాటేనండి...'' తన అక్కని, భర్తని కలిపి అనే లోకం మాటలు గుర్తుకివచ్చి మండిపడుతూ అంది కిరణ్.

''ఐనా ఆ మాటలకి విలువ ఇస్తూనే ఉంటాం. ఇవ్వకపోతే సాగదు. మనం ఉండేది ఈ లోకంలోనే. పైగా మనిషి సంఘజీవి—కిరణ్ !''

''ఐతే ఏమంటారూ ? ఇంట్లోనించి అక్కయ్యని పంపించి వేయమంటారా ?''

''కి...ర...ణ్...''

''ఈ ఇల్లు, ఈ సంపద — కేవలం మీవి మాత్రమే కావు. మా అమ్మా, నాన్నా ఇచ్చిన...''

''వాళ్ళిచ్చి పోయిన సంపదే ఎక్కువ మనింట్లో. కాదని ఎవరన్నారిప్పుడు ?''

''మరి— ! ?''

''నువ్వింత ఉగ్రరూపం దాలిస్తే ఇంక నే చెప్పాల్సిందేమీ ఉండదు.''

''ఆ అవసరం గూడా లేదు'' గదిలోనించి రుసరుసా బయటికి వచ్చిన కిరణ్ వత్సల కనిపించగానే అవాలనే ఐపోయింది. తనని తాను చేతనైన విధానంలో సర్దుకుని ''ఇంత సేపు ఎక్కడున్నావక్కయ్యా ?'' అడిగింది. కంఠంలో తీక్షణత వత్సల కనిపించగానే తగ్గించుకున్నా ఇంకా మిగిలిపోయి ఉంది. అందుకు మరీ చిన్నగానే ఐనా నవ్వింది వత్సల. నవ్వుతూనే—

''ఇంటి వెనక పెరటిలో ఉన్నాను'' అంది

''నీ ఆరోగ్యం అంత మంచిది కాదు. పైగా బిజ్జూని గూడా తీసుకు వెళ్ళావు. ఏమిటో ఈ సంసారం కన్నా ఏ ఆశ్రమం లోనో ఉంటే పీడా పోయేది'' ఇంకా రుసరుస లాడుతూనే వంటింటి వైపు వెళ్ళిపోయింది కిరణ్.

వత్సలకు ఈరకం మాటలు క్రొత్తవి కావు. తన తోబుట్టువుల్లో అందరికన్నా చిన్నది కిరణ్. కిరణ్ కన్నా పెద్దవాళ్ళు నల్గురూ గూడా ఈరకంగానే తనని చూచి

## ప్రారంభం !

రుసరుస లాడుతారు.

ఇవన్నీ ఎంత అలవాటైనా ఎప్పటికప్పుడు ఎంత తేలిగ్గా తీసుకుందామనుకున్నా బాధ పడకుండా ఉండలేదు.

తాను ఎక్కడున్నా ఈ అశాంతి, చివరకు ఒంటరిగాఉన్నా ఈ అశాంతి తప్పదు. చుట్టు ప్రక్కలవాళ్ళు, పరిచయస్తులు, స్నేహితులు, బంధువులు అందరూ అంతా రాబందుల్లా పీక్కు తింటారు. ఐనా వాళ్ళకా అధికారం ఉంది. వాళ్ళందరికీ ఈ అవకాశం ఇచ్చింది తానే. స్వయంకృతాపరాధం — నవ్వుకుంది వత్సల. ఈ నవ్వు తనకి బాధలు ఆరంభం ఐ, వాటిని జీర్ణం చేసుకుంటున్నప్పటినుంచి వస్తున్న నవ్వు. కడుపునిండా తిన్నప్పుడు వచ్చే త్రేన్పులాటి నవ్వు.

రాత్రిపూట భోజనాలప్పుడు మరిది మెల్లిగా ఎంతో అనునయంగా పిలిచాడు ''వదినా !'' అని.

''ఏం బాబూ ?'' అంది తలెత్తి మరిది ముఖంలోకి చూస్తూ వత్సల.

''నువ్వు ఏమీ అనుకోకపోతే ఒక్క విషయం...'' అని కొంచెం ఆగి మళ్ళీ— ''30–35 ఏళ్ళ వయస్సు పెద్ద తీసివేసే వయస్సేమీ కాదు. ఇప్పటికైనా పెళ్ళి చేసుకో వదినా... నీకు భర్త, ఇల్లు, పిల్లలు, సంసారం ఏర్పడి నీ జీవితం ఓ దారిన పడుతుంది. మనసు కుదుట పడుతుంది'' అన్నాడు. వత్సల సమాధానం ఇవ్వలేదు.

కిరణ్ అపశ్రుతిగా నవ్వి—

''ఈమెగారి పెళ్ళికోసం ఏడిచి ఏడిచి చచ్చిపోయింది అమ్మ. నాన్న బతికి సన్నాళ్ళు నిందలు, నెపాలు మోయలేక ఓ వైపు తన కూతురికి బాధ కలగకుండా మెసులుకుంటూ ఓ వైపు నలిగి పోయారు. పెద్దన్నయ్య నయానా భయానా చెప్పి చూశాడు. ఒక్క రేమిటి — లోకం అంతా ఏకమై చెప్పినా వినిపించుకోని మనిషి ఇహ ఇప్పుడు మీ మాటను వింటుంది లెండి — అనవసరమైన ప్రసంగం కాకపోతే'' కిరణ్ అంది గబగబా.

''బిజ్జూని చూస్తే నీకూ ఓ పాప కావాలని అనిపించదా వదినా ?''

''అనిపించకేం ! కాని కనటం కోసం కలిగే బాధని మా అక్కయ్య ఓర్చుకోలేదు. ఐనా ఎందుకొచ్చిన మాటలివి — పాత పాటని కొత్త రాగంతో పాడినట్లు ... ఊరుకోండి'' కిరణ్ అంది. చారుగిన్నె భర్త దగ్గరకు, నేతి గిన్నెను వత్సల దగ్గరకు జరుపుతూ.

''నీకన్నా చిన్నవాళ్ళంతా భర్త, పిల్లలు, సంసారంతో ఉంటూంటే అవన్నీ నీకుగూడా కావాలని అనిపించదా వదినా ?''

''ఎందుకనిపించదూ ! కాని భర్త మగ మనిషి. ఆడదాన్ని మగవాడు పీక్కుని తింటాడు. స్త్రీని దాసి దానిలానే చూస్తాడు పురుషుడు ... అంతే. ప్రతిస్త్రీని ప్రతి పురుషుడు అంతే ... ఇహ అతడి తల్లి, తండ్రి, తోబుట్టువులు — ఒక్క మాటలో చెప్పాలంటే అతని పరివారమంతా రాక్షసుల మూకే. ఈమెని మిగలకుండా మింగేస్తారు. ఇవన్నీ ఎంతవరకూ యదార్థమో కొంత కాలానికి తెలిసిపోయినా మొండితనం, పట్టింపు లనేవి ఉంటాయి కదా. వీటిని అక్కయ్య వదిలిపెడితే వాటిగతేం కాను?'' విపరీతమైన నిష్ఠూరంగా అంది కిరణ్.

''వదినను మాటాడినిస్తుంటే నువ్వెందుకు ధుమధుమలాడ్తావ్ కిరణ్ !'' చిరుకోపంతో అన్నాడు కిరణ్ భర్త.

''అక్కయ్య ఈ రకం మాటలకు సమాధానం ఇవ్వదులెండి'' అంది కిరణ్ ఎంతో స్థిమితంగా ... నిశ్చయంగా.

వత్సల చిన్నగా నవ్వి —

''ఇంట్లో ప్రొద్దుపోవటం లేదు రవి ! తిరిగి ఉద్యోగంలో జాయిన్ ఔతాను. రేపే వెళితే బాగుంటుంది'' అంది.

రవి గాబరాగా ''వదినా'' అని ఏదో చెప్ప బోయాడు. ఈలోగానే కిరణ్ —

''అంతే మరి. అక్కయ్యని వెళ్లిపొమ్మని చెప్పలేక ఈ మాటలన్నీ అన్నాం'' అని ఇంకో వైపు ముఖం ఇంత చేసుకుని కంట తడి పెట్టుకోసాగింది.

భోజనం మధ్యలోనే చాలించి రవి లేచి వెళ్లిపోయాడు. వత్సల తానూ భోజనం మీద నుంచి లేచి కిరణ్ దగ్గరకు వెళ్లి — ''నేను కోపంతో వెళ్లిపోవటంలేదు కిరణ్. నా మాట నమ్ము. నువ్వు ఏడ్వక...నాపై ఒట్టు'' మమకారంగా చెల్లెలను తనకు అదుముకొని బుజ్జగించ సాగింది. కాని కిరణ్ సమాధానపడలేదు. దుఃఖం ఇంకా పెరిగి వెక్కిళ్లలోకి పోయింది. వత్సల ఆందోళన పడుతూ చెల్లెలి ముఖం తన వైపు త్రిప్పు కుని —

''కిరణ్ ! ఏమిటమ్మ ఇదంతా? ఇక్కడ

విన్నాళ్లు ఉన్నా వెళ్లిపోవాల్సిన దాన్నేకదా ? మూడు నెలలనించి ఇంట్లోనే కూర్చున్నాను. ఇంక డ్యూటీలో జాయిన్ అవకపోతే సాగుతుందా?'' అడిగింది ఎంతో మృదువుగా.

''అది కాదక్కయ్యా–'' అని ఏడుస్తూనే మధ్య మధ్య అంటుంది. కాని అంతకన్నా చెప్పలేకపోతుంది కిరణ్.

''రవి గురించి కాని, నీ గురించి కాని అపార్థం చేసుకోవటం లేదు. రవి ఎలాటి వాడో తెల్సు కిరణ్ ! నువ్వు బాధపడకు. వీలు ఐనప్పుడల్లా ఈలాగే వచ్చి వెళ్తుంటాను'' అంది వత్సల తన చీరకొంగు కొనతో కిరణ్ కంటితడిని అద్దుతూ.

''అది కాదక్కయ్యా...''

''మరేమిటి చెప్పు–'' అప్రయత్నంగానే వచ్చే నవ్వును ఆపుకుంటూ అడిగింది.

''నీ ఆరోగ్యం బాగాలేదు. వండుకుని, తిని, మళ్లీ ఆఫీసుకివెళ్లి ఆ చాకిరి చేయాలి. ఇంటికి వచ్చాకైనా నీ బాగోగులు గురించి అడిగేవారు లేనిచోట ఉండాలి నువ్వు...''

''ఉండక తప్పుతుందా మరి ?''

''ఏ రాత్రిపూటో మళ్లీ నీకు గుండె నొప్పివస్తే ?'' ఆందోళనగా, బెదురుగా వత్సల ముఖంలోకి చూస్తూ అడిగింది కిరణ్.

''ఐతే ఏం చేయమంటావు ? ఇక్కడే ఉండిపోమంటారా ?'' మరీ చిన్నగా నవ్వుతూ అంది వత్సల.

''ఉండిపొమ్మని కాదు. నువ్వు పెళ్లి చేసుకో అక్కయ్యా...'' చివరి మాటలు ఆతృతగా, అప్రయత్నంగా అని ఆ మాటలు అన్నందుకు తనపై తనే విసుక్కున్నట్టుగా ముఖం పెట్టింది కిరణ్. కాని ఆశించని విధానంలో వత్సలనించి సమాధానం రావటం వల్ల విపరీత విధానంలో ఆశ్చర్యపోయింది కిరణ్.




# శుభోదయం

జీవితంలో ఈ కాస్త సుముఖంగా అదీ పెళ్లి విషయంలో వత్సల మాటాడ్డం ఇదే మొదటిసారి. ఆశ్చర్యం మాట ఏలా ఉన్నా ముందా మాటల్ని నమ్మలేక మళ్లీ అడిగింది.

''ఏమిటక్కయ్యా... ఏమన్నావు?'' అని చెవులు రిక్కించుకుని వత్సలనే చూస్తుంది కిరణ్.

''ఈ వయస్సులో నన్ను పెళ్లేవరు చేసుకుంటారు – పైగా రోగిష్టి దాన్ని...''మళ్లీ ఆ మాటే అంది వత్సల. ఆ మాటలకి పట్టరాని ఉత్సాహంతోతబ్బిబ్బై పోయింది కిరణ్. వత్సలతో ఎన్నో మాటాడాలని ఉంది. ఐనా ఏం మాటాడలేక మౌనంగానే ఉండిపోయింది కిరణ్.

''నేను రేపు ఉదయం బండికే వెళ్లిపోతాను. నువ్వు అభ్యంతరం చెప్పకు కిరణ్'' కొంచెం ఆగి వత్సలే అంది. ఈ సారి గూడా కిరణ్ మౌనంగానే ఉంది.

''ముందు భోజనం కానీయ్–''వత్సల మాటలకు ఆలోచనల్లోంచి తేరుకుని–

''నువ్వు గూడా తినక్కయ్యా, వారిని గూడా పిలుచుకు వస్తాను''అని లేచిందక్కడనించి.

* * *

కిరణ్‌ని, రవిని,–ముఖ్యంగా బిజ్జూనివదలి వెళ్లటం బాధగానే ఉంది వత్సలకు. కాని చెల్లెలి ఇంట్లో ఎంతకాలం అని ఉంటుంది ? ఇంక ఆ కుటుంబంలోని మనశ్శాంతిని దూరం చేయటం ఇష్టంలేక ఈ ప్రయాణం పెట్టుకుంది.

ట్రెయిన్‌లో విపరీతమైన జనం. వత్సల కిటికీకి దగ్గరగా కూర్చుంది. అంత జనంలో గూడా ఒంటరి తనాన్ని అనుభవిస్తుంది. ప్రక్కావిడ ఎవరో, ఒకటి–రెండు సార్లు వత్సలను మాటాడించింది. క్లుప్తంగా సమాధానం చెప్పి ఊరుకుంది వత్సల.

ఎవరితో మాటాడాలని అనిపించటం లేదు. మనస్సు గతంలోకి పరుగెత్తుతుంది. ఎంత కూడదనుకున్నా కొన్ని సంవత్సరాల వెనక్కి వెళ్లాయి స్మృతులు.

అప్పటికి ఆమె వయస్సు 16 సంవత్సరాలు. పి. యు. సి. చదువుతుంది. ఇంట్లో పిల్లలందరికన్నా వత్సల పెద్దది. ఓ రోజు రాత్రి పూట భోజనాలప్పుడు తల్లి అంది – ''రేపు పెళ్లి సంబంధం ఒకటి రాబోతుందమ్మా'' అని.

''నాకు మాటమాత్రంగానైనా చెప్పలేదేమమ్మా ?'' అంది వత్సల.

''అనుకోకుండా కలిసిన సంబంధం. నిశ్చయంగా మాకైనా ఈ రోజే తెలిసింది'' మామూలుగా అంది తల్లి.

''కాని, నాకీ సంబంధం వద్దు.''

''ఎందుకూ! అబ్బాయినిగాని చూచావా... బాగాలేడా ?''

''అదేంకాదు. నేనసలు పెళ్లి చేసుకోను.''

''చదువు గురించి యోచిస్తున్నావా ?''

''లేదమ్మా—చదువు పూర్తిఐనా పెళ్లి చేసుకోను. పెళ్లిపై నాకు సద్భావంలేదు. నేను ఈలాగే ఉంటాను — ఉద్యోగం చేసుకుంటూ. చక్కగా నా బ్రతుకేదో నేను బ్రతుకుతాను. పెళ్లి తర్వాత ఆ బానిస బ్రతుకు నాకు వద్దు. నేను బ్రతకలేను. నువ్వు పడుతున్న యాతనంతా చూస్తూనే ఉన్నాను. నాన్నమ్మ వల్ల నీకు ఎంత అశాంతో, అత్తయ్యలు నిన్ను ఎన్ని రకాలుగా వేపుకు తింటారో, నాన్నవల్ల నువ్వు ఎన్ని రకాల యిబ్బందులు పడ్డావో, మమ్మల్ని కనటానికి నువ్వెంత యమయాతనపడి – కని పెంచటానికి ఎంత ఇబ్బంది పడుతున్నావో—కనిపించనివి తెలియనివి కాదమ్మా ...నాకు పెళ్లి వద్దు'' అంది.

''ఇది జీవితం తల్లీ ! ఇవి ఉండక తప్పవు వత్సలా ! ఐనా నాకు సుఖం, మనశ్శాంతి లేవని ఎందు కనుకుంటున్నావూ ? మిమ్మల్ని కని పెంచటం కోసం బాధపడుతున్నా మీరు పుట్టి కనిపిస్తున్నప్పుడు, మీరంతా పెరుగుతున్నప్పుడు ఏ రకం ఆనందం, తృప్తి నా అనుభవంలోకి వస్తున్నాయో నువ్వు వూహించలేవు. ఈ అనుభూతి ముందు కనబోయే ముందు కలిగే బాధ, పెంచేటప్పుడు ఔతున్న ఇబ్బంది ఎంతో అల్పముగానే కనిపిస్తాయి. అలాగే మిగతావన్నీ గూడా. నాన్నమ్మా అత్తయ్యలు—వీళ్లవల్ల కొంత మనశ్శాంతి దూరం ఔతున్నమాట నిజమే. కాని మీ నాన్నగారు నాపై చూపించే ఆదరణ, అనురాగం...తన పిల్లలకు తల్లినేనని నన్ను గౌరవించే విధానం ముందు—అవి లెక్కలోకి వచ్చే విషయాలా వత్సలా !? పోతే – మీ నాన్నగారి వల్ల గూడా కొన్ని రకాల బాధలు పడ్డాను. నిజమే. ఐతే కొన్ని సుఖాలు, సౌకర్యాలు కావా

లనుకున్నప్పుడు కొంత బాధ కూడా తప్పదు' నువ్వు విద్య నార్జించాలను కుంటున్నావా ... ఐతే ఏ రకం బాధ, కష్టం, ఇబ్బంది లేకుండానే దాన్ని ఆర్జించగలవా నువ్వు? దేని గురించైనా అంతే.'' ఈ రకంగా ఇంకా ఎన్నో విధాలుగా వత్సలకు నచ్చచెప్ప ప్రయత్నం చేసింది తల్లి. ఐనా వత్సల ఇవేవి లెక్కించనప్పుడు తల్లి అయోమయ పరిస్థితిలో పడిపోయింది.

ఆ రాత్రంతా తల్లికి, తండ్రికి నిద్రలేదు. వత్సలను దగ్గర కూర్చోబెట్టుకుని తమకి సాధ్యం ఐనన్ని విధానాల్లో వత్సల అభిప్రాయాన్ని మార్చజూశారు. అంతా విని ''నాకు భార్యా భర్తల సంబంధాలంటేనే అసహ్యం'' అని వత్సల తేల్చివేసినప్పుడు తండ్రి ముఖం కత్తి వేటుకి నెత్తురుచుక్క లేనంతగా మారిపోయింది. ఇదంతా ఓ కంట కనిపెడుతున్న వత్సల పెద్ద తమ్ముడు శశి మంచంలో నుంచి లేచివచ్చి—

''అక్కయ్యకి, సుధకి స్నేహం కదమ్మా! పెళ్లిపిల్ల వాళ్ల స్నేహానికి అంతరాయం ఏర్పడుతుందని వీళ్లిద్దరూ పెళ్లి మానుకున్నారు'' అన్నాడు.

తల్లీ, తండ్రి పిచ్చివాళ్లలా ఒకరిముఖాలు ఒకరు చూసుకున్నారు.

''ఔనా వత్సలా?'' అడిగాడు తండ్రి నమ్మలేక కాబోలు.

''ఔను నాన్నా'' అంది వత్సల ఏవిధమైన మార్పులేని కంఠస్వరంతో.

వత్సల ధైర్యవంతురాలని, పట్టుదల, తెలివితేటలు, నిర్భీతిగల మనిషని తెలుసు వాళ్లకి. కాని వాటిని దుర్వినియోగ పర్చుకుంటుందని కన్నవాళ్లకి తెలియదేమో. విపరీత విధానంలో ఆశ్చర్యపోయా రిద్దరూ.

''సుధ చాలా మంచిపిల్ల. కొన్ని ప్రత్యేకతలు, అర్హతలుగూడా ఉన్నాయ్ అమ్మాయిలో. మీ ఇద్దరి స్నేహమూ హర్షించదగ్గదే. కాని స్నేహం వ్యసనంగా పరిణమించగూడదు తల్లీ...'' అన్నాడు తండ్రి.

''మా స్నేహం వ్యసనమైనా సరే నాన్నా... దాన్ని వదులు కోవడం జరగదు. అలాగే ఈ పెళ్లి పేరంటాలుగూడా అసంభవమే. నన్ను క్షమించండి'' అంది స్థిర నిశ్చయంతో.

''చూడమ్మా వత్సలా! మనిషి జీవించి

[46 వ పేజీ చూడండి]

## హనుమంతుని దౌత్యం

—ధర్మపథం—

బులుసు వెంకటరమణయ్య

సీతా న్వేషణ కోసం సుగ్రీవుడు వానరులను నాలుగు దిక్కులకూ పంపినపుడు హనుమంతుడు, అంగదుడు, జాంబవంతుడు ముఖ్యగు ప్రముఖులు దక్షిణ దిక్కునకే వెళ్లారు.

సీతను అపహరించుకొనిపోయిన రావణుడు లంకాధిపతి. ఆమెను లంకకే అతడు తీసుకొని వెళ్లి ఉండవచ్చుననే ఆలోచనే దీనికి కారణం. సీతాదేవిని చూడడం తటస్థిస్తే, ఆమెకు తన విషయం చెప్పాలనీ, అలా చెప్పిన మాటలు ఆమె నమ్మడానికి వీలుగా ముద్రికను ఇవ్వాలనీ, రాముడు హనుమకు తన అంగుళీయం ఇచ్చాడు. దూతకార్యానికి—అందులోనూ మహిళకు సందేశం చెప్పడానికి అతడే తగినవాడని రాముని అభిప్రాయం. దూతకు ఉండవలసిన ఉత్తమ గుణాలన్నీ అతనిలో ఉన్నవి. ఆ గుణాలివి—

'బ్రహ్మచారీ బలీ ధీరో
మాయావీ మానవర్జితః,
ధీమానుదారో నిశ్శంకో
వక్తా దూతః స్త్రియాం భవేత్.'

స్త్రీల దగ్గరకు రాయబారిగా వెళ్లేవాడు బ్రహ్మచారిగా ఉండవలెను. అతనికి ఎక్కువ బలం ఉండవలెను. ధైర్యం ఉండాలి. మోసగాళ్లయెడల మాయావియై ఉండాలి. మానాభిమానాలను విడిచి పెట్టాలి. అతడు బుద్ధిమంతుడై ఉండాలి. త్యాగబుద్ధి కావాలి. సందేహిస్తూ ఉండకూడదు. అతడు మాటనేర్పరి అయి ఉండాలి.

ఆ రాయబారి అస్ఖలిత బ్రహ్మచారిగా ఉండకపోతే మనశ్చాంచల్యం కలిగి, కార్యం చెడిపోయే ప్రమాదం సంభవిస్తుంది. హనుమ బ్రహ్మచారి కాబట్టే సీతయెడ మాతృభావం చూపినాడు. బలవంతుడు కాకపోతే సముద్రాన్ని లంఘించడం, నిరాయుధుడై ఉండిన్నీ, మహావీరులైన రాక్షసులను సంహరించడం సాధ్యమయేదికాదు. ధైర్యం లేకపోతే హనుమ సముద్రాన్ని దాటడానికి పూనుకోడు. రాక్షసరాజును ఎదిరించి మాటలాడి ఉండడు. మాయావి కాబట్టే వికార రూపం ధరించి, తన్ను మాయం చెయ్యదలచిన సురసను మోసగించి తప్పించుకున్నాడు. అవసరాన్ని బట్టి, మానాభిమానాలను విడివాడు కాబట్టే తన్ను అవమానించిన క్షుద్ర రాక్షసుల బాధలకు ఓర్చి, లంకను దహించ గలిగినాడు. బుద్ధిమంతుడూ, త్యాగశీలి కాబట్టే, సందేహం లేకుండా సాహసం చూపబట్టే చూచి రమ్మంటే కాల్చి వచ్చాడు. సీతాదేవితోడి సంభాషణ అతని వాక్చాతుర్యానికి దృష్టాంతం.

# ప్రశ్నావళి
## కె. రామలక్ష్మి

**ఎస్. జి. ఆర్. కె. కడప.**

ప్రేమించటం నేర్చుకున్నాను. కాని ప్రేమ పొందలేదు. ఎలా?

తొలి విద్య నేర్పిన స్కూల్లోనే మళ్ళీ చేరకూడదా?

**వి. ఆర్. బెంగుళూరు.**

అంతు తెలియని సముద్ర భూగర్భాలనుంచి సుదూరమైన చంద్రోపగ్రహాలని ఛేదించగల్గిన పురుషుని అధిగమించాలనుకోవడం నిజంగా విూ స్త్రీల అవివేకం?

చిత్రం. తమరిది కాకి చూపులా వుంది. వెలంటీనా ఎవరు? అట్లాంటిక్‌ని ఒంటరిగా దాటిన తొలి విమాన చోదకురాలుందని విన లేదా. .

**ఆర్. పి. కొండముద్దుపాలెం.**

ఒక స్త్రీ కారణంగా నా మనస్సు చెడి పతన మైనాను. అప్పటినుండి స్త్రీజాతి మీద కక్ష ఏర్పడింది . . .

కక్ష తీర్చుకుందుకు ఒక్కటే దారి . . మనకి బాధ కల్గించినవారిలాగా— మనం ప్రవర్తించక పోవడమే !

**పి. కె. ఎమ్. — నిడుతూరు.**

అనుకున్నది నెరవేరకపోతే బ్రతికి నిరర్థకం అంటారు. ఎంతవరకు నిజం ?

అర్థంలేనిమాట. అనుకున్నవి సాధింప తరమైన విగా వుండాలి. వాటి వెనుక తగినంత కృషి వుండాలి.

**పి. ఎ. క. హైద్రాబాదు.**

మంచి భర్తలుంటారా ?

బాగా పెంచిన కొడుకులే మంచి భర్తలవుతారు.

**బి. వి. ఆర్. — భావదేవరపల్లి.**

నా దగ్గిర చాలా కార్టూనులు వున్నాయి. వాటి సంబంధించిన బొమ్మలు మేమే గీచి పంపించాలా?

బాబూ, కార్టూను అంటేనే బొమ్మ కూడా వున్నదనే తెలియదా !

**కె. వి. జి. ఆర్. — ఇల్లెందు.**

వరకట్నం సమస్య ఇంకా తీరలేదు. ఈ విష యంలో ఆడవారి కింకా అన్యాయం జరుగుతూనే వుంది.

ఆడపిల్లలు—'మేం కట్నం పుచ్చుకున్నవాడిని పెళ్ళిచేసుకో'మని తిరగబడిననాడు కాని ఈ సమస్యకి ఒక పరిష్కారం ఏర్పడదు. వివాహ విషయంలో డబ్బు ప్రసక్తికి తావుండడం సిగ్గుచేటు అని భావించడం మొదలు పెడితేగాని—ఇదిపోదు.

**ఎమ్. వి. ఆర్. — సికింద్రాబాద్.**

మిమ్మల్ని వెనక తిట్టుకునే వాళ్ళు చాలా మంది వున్నారు. వీరిని మీరేమంటారు ?

అసమర్థు లెప్పుడూ పరోక్షంలోనే ప్రగల్భాలు పల్కుతారనుకుంటాను !

**టి. జె. ఆర్. — హైద్రాబాద్.**

స్వార్థం మనిషిని ఎంతవరకు సంతృప్తి పర్చ కలదు ?

స్వార్థం తీరని దాహం. ఎక్కువ అవుతుందేగాని తగ్గదు.

**ఎస్. వి. ఆర్. — సికింద్రాబాద్.**

ధనవంతుని దగ్గిరకే ధనం చేరుతుంది ఎలా ?

ధనవంతునికి ఎలా ధనం వచ్చిందని వెతకడం కిరీటం పెట్టుకున్న తలకి సుళ్ళు లెక్కపెట్టడం లాంటిదే—అర్థం లేనిపని.

**ఎమ్. వి. కె. ఆర్ — వరంగల్.**

నా కలలన్నీ కల్లలయిపోతున్నాయి— ఏంచేయాలి?

కలలు నిజంకావాలంటే— మేల్కొని పని చేయాలి బ్రదర్. అది ముఖ్యం.

వూహాలు చాలవా ? మాటలు కూడా ఎందుకు?

మాటలు మేకులుంటే కదా వూహాలు ఆరవేయు డానికి ?!



# సుప్రభాతమ్

ఎం. కామేశ్వరరావు

"వాకు పొయ్యి మండిపోతోంది. ఇంకా రొట్టెలు చేయాలి. ఏం పనో చెప్పండి" భర్త కేకకు వంటింట్లోంచే జవాబు చెప్పింది జానకమ్మ. పొయి మీద అన్నం కుతకుత లాడుతోంది. కుంపటిమీద పప్పుడుకుతోంది. ఇంకా చారు పెట్టాలి! పచ్చడి రాజ్యం రుబ్బినా పోపు వేయించి ఇవ్వాలి. అప్పటికే గంట ఎనిమిదిన్నర అయింది.

"ఒకసారిలా రా!" మళ్లీ అదే మాట అన్నారు రామనాధంగారు.

"అబ్బబ్బ! చెబితే వినిపించుకోరు!" విసుగ్గా లేచి, తూము దగ్గర చేతులు కడుక్కుని, తడిచేతుల్ని కొంగుకు తుడుచుకుంటూ వచ్చింది జానికమ్మ "ఊపిరి సలపని పనిలో నేనుంటే ఏమిటండీ ఈ పిలుపులు?"

"బట్టలు చాకలికి వేయమని మూడు రోజులనుంచి చెబుతున్నాను."

"అవును. నేనూ ఆ వీరాసామిని రమ్మని చెప్పరా అని నానిగాడికి చెబుతూనే ఉన్నాను. కాలేజికెళ్లే దారిలో లాండ్రీ ఉన్నా చెప్పటానికి వీడికి నామోషీట. నిన్న బుజ్జిగాడిచేత కబురు పంపించాను. ఇవాళ వస్తానన్నాడుట !"

"ఇవాళ పట్టికెళ్లి ఎప్పుడు తెస్తాడు? నావి నాలుగు జతలు మాసి ఉన్నాయి. ఇదిగో ఈ జత వేసుకుందామంటే చొక్కా గుండీలు రెండు లేవు. తొందరగా కుట్టి పెట్టు."

"బావుంది వరస. అవతల పొయి మండిపోతూ ఉంటే ఇప్పుడు బొత్తాలు కుడుతూ కూర్చోమంటారా? ఇంకా రొట్టెలు చేయనే లేదు. మళ్లీ అరగంటకల్లా అంతా టిఫినంటూ తయారవుతారు. రాజ్యాన్ని కుట్టి పెట్టమన కూడదూ, నన్నే పిలవాలా?"

"అది స్నానం చేస్తోంది. రెండుబొత్తాలు ఎంత సేపట్లో కుడతావు?"

ఇంతలో పెద్ద కూతురు రాజ్యం తువ్వాలుతో తల తుడుచుకుంటూ అద్దంముందుకు వచ్చి తిలకం సీసా చేతిలోకి తీసుకుంది.

"అదిగో, అది వచ్చేసింది. నాన్నగారి చొక్కా బొత్తాలుట, రెండుకుట్టి పెట్టవే రాజ్యం" వంటింటి వైపు వెళ్లిపోబోతూ అంది జానికమ్మ.

రాజ్యం తాపీగా పౌడరు బుగ్గలకి అద్దుకుంటూ "దారపుండ లేదుకదే! నిన్న సాయంత్రం కనకాంబరాలు కట్టుకోడానికి, కుంకుడు కాయల పొట్లానికి కట్టిన దారాన్ని విప్పాల్సి వచ్చింది" అంది తల్లి వైపుకి తిరుగుతూ.

జానికమ్మ కాళ్లకి సడెన్ బ్రేక్ పడింది. నిజమే! తనకి గుర్తు రాలేదు. ఇంట్లో దారపుండ లేదు.

"ఏడిసినట్లుంది. దారపుండ పూర్తిగా అయిపోయేదాకా ఏం చేస్తున్నారు? మళ్లీ ఇంట్లో నలుగురు ఆడవాళ్లున్నారు." చిరాకు పడిపోయారు రామనాధంగారు.

"బుజ్జిగాడిని కనకయ్య కొట్టుకు వెళ్లి తీసుకురమ్మను."

"ఇక వాడు వెళ్లి తీసుకువచ్చి, ఇది బొత్తాలు కుట్టి, నేను వేళకి ఆఫీసుకు వెళ్లటం అయ్యేపనే !"

"మీది మరీ చాదస్తం. ముందే అన్నీ రడీగా పెట్టుకోవాలంటారు. మీ టిఫిన్ అయ్యేలోపల బొత్తాలు కుట్టడం అవదేమిటి? పోనీ పక్కింటికివెళ్లి తీసుకురావే!" అంది జానికమ్మ పెద్ద కూతురితో.

"నేను వెళ్లను. లక్ష్మిని వెళ్లి తీసుకు రమ్మను."

"నేను హోంవర్క్ చేసుకుంటున్నాను. సావిత్రిని వెళ్లి తీసుకురమ్మను." మధ్య గదిలో హోంవర్క్ చేసుకుంటూనే అంతా వింటూన్నలక్ష్మి,అక్కడ నుంచే కేకపెట్టింది.

అప్పుడే పూజకని పక్కింటి నుంచి పూలు పట్టుకొచ్చిన సావిత్రి మళ్లీ వెనక్కి వెళ్ల మన్నందుకు విసుక్కుంటూ వెళ్లి దారపుండ తెచ్చింది.

జానికమ్మ నిట్టూర్చి వంటింట్లోకి నడిచింది. ఉడికిపోయిన అన్నం గిన్నె దింపేసి, పెనం కాలేసింది. అట్లకాడ, రొట్టెలు వత్తుకునే పీట, కర్ర అన్నీ దగ్గిరగా పెట్టుకుని, తడిపి ఉంచుకున్న పిండిని మదాయించ సాగింది. ఇప్పుడు రొట్టెలు చేయాలి, పిల్లలకి, ఆయనకి; పెట్టాలి! మధ్యాహ్నం ఆఫీసు దూరం కాబట్టి ఆయన రారు. కారియర్ కట్టి ఇవ్వాలి. పిల్లల బడులు దగ్గిరే. మధ్యాహ్నం వచ్చి తిని వెళతారు. రోజా టిఫినూ, వంటా ఒకే వేళకు చేయవలసి రావటంతో హడావిడి ఎక్కువవుతోంది. రేపటి నుంచీ పిల్లలకి ఒంటిపూట బళ్లట. ఇక ఊపిరి సలపనివ్వరు. కాస్త పెందరాళే లేవాలి. ఒకొక్క రొట్టె ఒకవైపు వత్తుతూ, మరోవైపు కాలుస్తూ ఉండి ఉండి పొయిలో మంట ఎగదోస్తూ ఆలోచిస్తోంది జానికమ్మ.

"అమ్మగారూ, త్వరగా బట్టలు వేయండి!" గట్టిగా వినిపించింది వీరసామి గొంతు.

"ఎప్పుడూ ఇంతే! సరిగ్గా మంచి పని వేళ చూసుకుని వస్తాడు."

"తొందరగా వేయాలమ్మ గారూ ! మళ్లీ రేవుకి పోవాల !"

"ఒరేయ్ బుజ్జిగా, వీరసామి వచ్చాడని అమ్మకి చెప్పు" వీధి గదిలో కూర్చుని పేపర్ చూస్తున్ననాని, తమ్ముడిని ఆజ్ఞాపించాడు. మాటలన్నీ జానికమ్మకు స్పష్టంగా వినిపిస్తూనే ఉన్నాయి.

బుజ్జిగాడు వంటింటి గుమ్మం దాకా వచ్చి, "అమ్మా 'దోభీ' వచ్చాడు." అన్నాడు కొత్త విషయం చెబుతూన్నట్లు.

"వినబడిందిలే! మీ మాసిన బట్టలు తీస్తూ ఉండండి. ఒసేవ్, రాజ్యం! బొత్తాలు కుట్టడం అయిపోతే పద్దు వ్రాయి. నాన్నగారి పాంట్ జేబులూ, చొక్కా జేబులూ మరోసారి చూడు." అని రాజ్యాన్ని కేక వేసింది జానికమ్మ.

"నాకు వేయటం రాదు బాబూ! నువ్వే వేసుకో!" బొత్తాలు కుట్టేసి, పచ్చడి రుబ్బుదామని వచ్చింది రాజ్యం "ముందు నాకు పోపు వేయించి ఇచ్చివెళ్లు".

"ఇంతకు మునుపు వేశావు కదే! అయినా మెట్రిక్ పాస్ అయిన దానివి, "చాకలిపద్దు" వేయటం రాదంటే ఎవడయినా నవ్విపోతాడు. నేనే వేద్దునుకుంటే ఇంకారొట్టెలుచేయటంకాలేదు."

"క్రితం సారి వేస్తే ఒక బనీను కనబడటం లేదని, నేనే పద్దు తప్పువేశానని తిట్టలేదూ! ఇక నేను చాకలిపద్దులు వేయనే వేయను. నువ్వే వేసుకో!" రోషంగా మొహం ఎర్రచేసుకుంటూ అంది రాజ్యం.

జానికమ్మ మరి మాట్లాడక, "నేనే వేసుకుంటాను లే తల్లీ! నువ్వీ రొట్టెల సంగతి చూసుకో!" అంటూ లేచిపోయింది.

రాజ్యం పోయి ముందు పీటమీద కూలబడింది.

జానికమ్మ మాసిన బట్టల పెట్టెలోంచి బట్టలన్నీ పైకి తీసి, రామనాధంగారి పాంట్ జేబులు వెతుకుతూ! "నానిగా! నీ బట్టలు కూడా ఉంటే వేసెయి" అని పెద్దకొడుక్కు కేక వేసింది.

బట్టలపెట్టె తెరచి, పద్దు పుస్తకం





కోసం వెతుకుతూ "ఎవర్రా, పెట్టె ఇలా కెలికివేసింది? ఈ దిక్కుమాలిన చెత్తంతా అమ్మ పెట్టెలోనే!... అంటూ బుజ్జిగాడు అమ్మ పెట్టెలో దాచుకున్న ఖాళీ సిగరెట్ ప్యాకెట్ల నన్నింటిని కిటికీలోంచి బయటకు గిరవాటి వేసింది. పెట్టంతా వెతికినా పద్దు పుస్తకం జాడలేదు.

"రాజ్యం! పద్దు పుస్తకం ఏదే?"

"నాకు తెలియదు?"

"క్రితంరేవులో పద్దు నువ్వే చూశావుగా"

"చూడగానే నీ పెట్టెలోనే పెట్టేశాను'

ఒకవేళ పెట్టె వెనక్కిగాని పడిపోయిందేమోననుకుని, పెట్టెని ముందుకు లాగి చూసింది జానికమ్మ. పెట్టె వెనక పద్దుపుస్తకం లేదుగానీ, బూజు, కాగితం ముక్కలు, చెత్తా చెదారం పుష్కలంగా ఉంది. "లక్ష్మీ, నీకు పెట్టె ముందుకు జరిపి వెనకనుంచీ తుడవాలని ఎన్నిసార్లు చెప్పానే! చూడు!ఎంత చెత్త పేరుకుపోయిందో." అంటూనే కొండ చీపురుతో చెత్తంతా ఇవతలకు తుడిచేసింది.

"బుజ్జిగా, కాగితం, కలం తీసుకురా. ఈ సారికి కాగితంమీద వేసేస్తాను" అని కేక పెట్టింది జానికమ్మ

తనకేమీ పట్టనట్లుగా టిఫిన్‌కోసం ఎదురుచూస్తూ, ఆ రోజు పేపర్ చూస్తున్న రామనాథంగారు, "మళ్ళీ కాగితం ఖర్చు చేయి, ఎక్కడయినా పారేశేవు!"...అని మళ్ళీ పేపర్‌లో మొహం దాచేసుకున్నారు.

పెన్ను విదిలించుకుంటూ వచ్చిన బుజ్జిగాడు, "పెన్‌లో ఇంక్‌లేదు పోసి ఇస్తాను." అని కిటికీదగ్గర ఉన్న ఇంక్‌బాటిల్ వైపు నడిచాడు.

దండెంమీది యూనిఫారమ్ చూసి జానికమ్మ, "ఒసేవ్ లక్ష్మీ, నీ యూనిఫారమ్ మాసిపట్లుంది" అని ఇంకా ఏమీ అనకుండానే, "వేసేయ్" అంది లక్ష్మి మధ్య గదిలోనుంచి.

సీసా పడిపోయిన శబ్దానికి ఉలిక్కిపడి కిటికీవైపు చూసింది జానికమ్మ. ఇంక్ సీసా నేలమీద పడి పూర్తిగా బద్దలయి పోయింది. ఇంక్ నేలంతా పరుచుకుపోయింది. "ఏ పని చెప్పినా ఇంతే! లూజు వెధవా, లూజు చేతులూ నువ్వూను! ఉన్నవి చాల వన్నట్లు మరో పని కల్పించావు" జానికమ్మ బిగించిన పిడికిలి బలంగా బుజ్జిగాడి నెత్తిని ముద్దు పెట్టుకుంది.

"నెమ్మది... నెమ్మది..." పేపర్‌లోంచే హెచ్చరించారు రంగనాథంగారు.

"మీరూరుకోండి." అని విసురుగా అని "లక్ష్మి నీ పెన్ను ఒకసారి ఇయ్యి" అంటూ మధ్యగదిలో చాప పరుచుకుని చుట్టూ పుస్తకాలు పేర్చుకున్న లక్ష్మి దగ్గిరకి వచ్చింది జానికమ్మ.

లక్ష్మి మాటి మాటికి పెన్ను విదిలిస్తూ, రఫ్‌బుక్ వెనక పేజీలో వంకర గీతలు పెడుతోంది. "పాళీ విరిగినట్లుందే! ఉండు, పెన్సిల్ ఇస్తాను." అంటూ జామెంట్రీ బాక్స్ తెరిచింది. పెన్సిల్ ఉందిగానీ దానికి ములికి లేదు. "ఇప్పుడే చెక్కి ఇస్తాను." అంటూ అందులోంచే పాత బ్లేడు తీసి చెక్కసాగింది లక్ష్మి.

"అమ్మా! వీరాసామి త్వరగారమ్మంటున్నాడు" వీధి గదిలోంచి కేక పెట్టాడు నాని.

"వస్తున్నానురా! తొందరగా చెక్కి ఇయ్యవే!" అని తొందర పెట్టింది జానికమ్మ. గబగబ చెక్కబోయి బ్లేడ్‌తో వేలుని కోసుకుని, "అబ్బా" అంటూ పెన్సిల్ జారవిడిచేసింది లక్ష్మి. రక్తం బొట బొటా వచ్చేస్తోంది.

"అయ్యబాబోయ్... బాగా తెగిపోయినట్లుందే!" అని గాబరాపడుతూ కూతుర్ని వంటింట్లోకి తీసుకొచ్చి వేలు చన్నీళ్లల్లో పెట్టి, రక్తం రావటం కొంచెం తగ్గాక పసుపు అద్దింది జానికమ్మ.

తరువాత సగం చెక్కిన పెన్సిల్‌ని, బ్రౌన్ కాగితాన్ని తీసుకొని, పత్తుకోసం పాతపత్రికను వెతికి సంపాదించి, మాసిన బట్టలతోసహా వీధి గదిలోకి వచ్చింది.

వీధి గదిలో వీరాసామి లేడు.

"ఆలస్యం అయిపోయిందని వాడు వెళ్ళిపోయాడమ్మా! మళ్లీ రేపు వస్తాడుట." చల్లగా అసలు విషయం బయట పెట్టాడు నాని.

జానికమ్మ ఏదో అనబోయి, వంటింట్లోంచి రొట్టె మాడుతూన్న వాసనవేసి, కంగారుగా అవైపుకి పరుగెత్తింది.

# మతిపోగొట్టుకున్న మనిషి

**వి. ఎస్. చెన్నూరి**

**రెస్ట్ హౌస్ అటెండెంట్ రాముడు తెచ్చి లోనికి వెళుతూ వెళుతూ టేబుల్ మీద పెట్టి వెళ్ళిన ఫ్లాస్కులోంచి కప్పులోకి కాఫీ వొంపుకుని తాగాను. సిగరెట్టు వెలిగించుకుని తీరిగ్గా కిటికీ వద్దకి చేరుకున్నాను.**

ప్రొద్దుటాల్టి పిల్లగాలులు రివ్వురివ్వున లోపలికి దూరి చల్లచల్లగా తాకి, గిలిగింతలుపెట్టి పారిపోతున్నాయ్.

ఎదురుగా భూమ్యాకాశాలు కలిసేచోట సూర్యారుణ బింబం ఉదయిస్తోంది. ఆకాశం బంగారు రంగులు పులుముకుంటోంది. చీకట్లు పారిపోతున్నాయ్. పక్షుల కిలకిలారావంలో ప్రకృతి మేల్కొంటోంది !—

గుమ్మానికి ఎదురుగా ఆవరణలో రెండు పిల్ల తాటిచెట్లు ద్వారపాలకుల్లా నిల్చుని వింజామరలు వీస్తున్నాయ్. ఆవరణచుట్టూ గుబురుగా పెరిగిన మామిడి సంపెంగచెట్లు విరగబూసి కమ్మని సుగంధాన్ని వెదజల్లుతున్నాయ్.



వూరికి అరమైలు దూరంలో ఉన్న ఆ రెస్టు హౌస్ ఆవరణలో ప్రశాంతత తాండవిస్తోంది. ప్రకృతి శోభని తిలకిస్తూ మత్తుగా నిల్చునివున్నాను.

ఎవరో నడుస్తున్న అడుగుల చప్పుడు !... ఏ వన దేవతో అతిసుకుమారంగా నడిచివస్తున్న అందెల రవళి!..... అతి సమీపంలో మోగిన గాజుల గల గలలు !.....

మత్తులోంచి బైటపడి పక్కకితిరిగి చూశాను. వో యువతి రివ్వున దూసుకొచ్చింది లోపలికి.

ఆమె ఆయాసంతో రొప్పుతోంది. ఆమె ముంగురులు నుదుటిమీద అల్లిబిల్లిగా ఆడుతుంటున్నాయ్.

పాలికోళ్ళు కూడా వుండవు. ఎత్తుగా, పచ్చగా, పోతపోసిన పసిడివిగ్రహంలా వుంది. చేరడేసికళ్ళు. కొనతేరినముక్కు. గులాబీ చెక్కిళ్ళు మన్మధుడి విల్లులా ఒంగిన పెదాలు. గులాబీరంగు పుల్ వాయిల్ చీర. అదేరంగుజాకెట్టు నల్లత్రాచులా కుడిభుజం మీంచి ముందుకు జారిన వాలుజడలో తురుముకున్న మల్లెచెండు !—

ఏ ఆభరణాలూ లేకపోయినా అప్పుడే దివినుండి భువికి దిగివచ్చిన అప్సరసలా, దారితప్పిన వనదేవతలా, పులుగడిగిన ఆణిముత్యంలా మెరిసిపోతోంది.

ఆమె అందానికి మున్గిన్నాయి ఆశ్చర్యంలోంచి తేరుకోకముందే ఆమె నన్నుచేరుకుంది.

"అమ్మదొంగా ! ఇక్కడ దాగున్నావా ?—ఇంత కాలం ఏమయ్యావు ?—ఇప్పుడు గుర్తుకొచ్చానా నేను ?—నన్నిక్కడ విడిచిపెట్టి దొంగలా ఎందుకు పారిపొయ్యావ్? "అంటూ నాముఖంలో ముఖంబెట్టి నా కళ్ళల్లోకి చూసింది. "ఎలాగయితేనేం ? దొరికావుగా ?—ఇకనన్ను విడిచి ఎక్కడికి పారిపోతావ్ ?" అంటూ గట్టిగా నారెక్క పుచ్చుకుంది.

వో అపరిచిత స్త్రీ, అందగత్తె, యువ్వనాంగి నాసరసనుచేరి నన్నిలా ప్రశ్నిస్తుంటే నామెదడు పనిచెయ్యడం మానివేసింది.

"అబ్బాయిగారికి కోపమొచ్చింది కాబోలు !" కళ్ళుగుండ్రంగా తిప్పి, ఒయ్యారం ఒలకబోసి, నాకళ్ళలోకి చూచి పకపకా నవ్వింది.

అంతలోనే ఆమె ముఖంలో విషాదఛాయలు అలముకున్నయ్. కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. రెండు కన్నీటిబొట్లు ముత్యాల్లా చెంపలమీంచి క్రిందికి జారాయి.

ఆమె పమిట చెంగుతో కళ్ళు తుడుచుకుంది. ముంగురులు సర్దుకుంది. "నీకోసం నేనెంతగా బెంగ పెట్టుకున్నానో నీకేం తెలుసు ? ఏడ్చి ఏడ్చి కళ్ళు ఎలాకాయలు కాచాయోచూడు !" అంటూ బుంగ మూతిపెట్టింది. "ఇప్పుడయినా నన్ను నీవెంట తీసి కెళతావా ప్రకాశ్ ?" జాలిగా నాముఖంలోకి చూస్తూ నాచేతులు రెండూ పట్టుకుంది.

ఉలిక్కిపడ్డాను "ఎవరీ సుందరాంగి ? —ఏమి

# ప్రత్యేక కాఫీ విప్లవం విస్తరిస్తూంది

దక్షిణ దేశంలో కాఫీ త్రాగే
వారందరూ రికరి ప్రత్యేక రుచిని
ఆస్వాదించడం మొదలుపెట్టారు,
సమృద్ధిగా సంతృప్తినిచ్చే రికరి. ఈ
రోజే విశిష్టమైన కాఫీ రుచిని చూడండి.
మీరూ ఎంతో ఇష్టపడతారు.




ACIL-RIC-73-4-Tel

## రికరి®
## ఇన్‌స్టెంట్

**ప్రత్యేక రుచిలో ప్రత్యేక కాఫీ**

టేమో ప్రవర్తన?—నాపేరు ఈమెకి ఎలా తెలుసు?" ఆశ్చర్యంగా ఆమెకేసి చూశాను.

ఎక్కడా చూచినట్టు గుర్తుకి రావడంలేదు ఎంత ప్రయత్నించినా.

ఏదో గంభీరమైన కంఠం నా ఆలోచన్లని చెదరగొట్టింది.

"వనజా !—అమ్మాయ్ వనజా !" దిక్కులు పిక్కటిల్లేలా కేకలువేస్తూ, సమీపిస్తోందిఏో గంభీర మైన మగగొంతుక.

చూస్తుండగనే ఆమె ముఖంలో భయాందోళనలు దోబూచులాడాయి. భయంతో ఆకులా ఆపాద మస్తకం గజగజలాడిపోయింది.

"అదిగో! మా నాన్నగారొస్తున్నారు! నే నిక్కడున్నానని తెలిస్తే బలవంతంగా లాక్కుపోతారు! గదిలోపెట్టితాళం వేస్తారు! నన్ను దాచెయ్ ప్రకాశ్! నే నిక్కడ లేననిచెప్పు! ప్లీజ్ !" అంటూ నన్ను బల్లిలా అతుక్కుపోయింది.

నాకంతా అయోమయంగా వుంది !—

ఆరడుగుల నిండువిగ్రహం అంగలువేసుకుంటూ వచ్చి గుమ్మంలో ఆగిపోయింది. యాభై ఏళ్ళపైనే వుంటయ్. ముగ్గు బుట్టలా తెల్లగా నెరిసిన వెంట్రుకలు. గుబురుగా పెరిగిన గడ్డం. ఒత్తుగా పెరిగిన మీసాలు. ముడుతలు బడ్డముఖం. అగ్నిగోళాల్లా మండే కళ్ళు. గంభీరమైన ముఖం !—

"వనజా !—మర్యాదగా బైటికివస్తావా ?—లోపలికివచ్చి బలవంతంగా లాక్కుపొమ్మన్నావా ?" హాలుదద్దరిల్లేలా గద్దించాడా వృద్ధుడు.

ఆమె తండ్రికాబోలు !—పాపం, ఆమె గజగజలాడిపోతూ నన్నువదిలేసి, భయంభయంగా నాకేసి చూసి, గబుక్కున వెనక్కితిరిగి, పిల్లిలా అడుగుమీద అడుగేసుకుంటూ గుమ్మందాకా వెళ్ళి ఆగింది. మరోమాటు నాకేసి తిరిగి చూసింది.

"నిన్నాగదిలోంచి కాలుకదపొద్దని చెప్పానా ?—ఎందుకొచ్చా విక్కడికి ?—ఊఁ—కదుల్తావాలేదా?"

ఆ గద్దింపుకి ఉలిక్కిపడి వెనక్కితిరిగి, గబుక్కున గుమ్మందాటేసి, ఒకటే పరుగులంకించుకుంది. చిన్నపిల్లలా.

వృద్ధుడు పైపంచెతో కళ్ళుతుడుచుకుంటూ నాకేసి తిరిగి, "మతిచలించిన మనిషి బాబూ ? మీరేమీ అనుకోకండి !" అంటూ వెనక్కి తిరగబోయ్యాడు.

ఆగమన్నట్టు అడుగుముందుకివేశాను.

"అది తిన్నగా ఇంటికి వెళుతుందోలేదో ! ఎటయినా పారిపోతే మళ్ళీబాధపడవలసి ఉంటుంది ! తరువాత కలుసుకుంటాలే బాబూ ! వస్తా !"అంటూ పై పంచె దులుపుకుని, అంగలువేసుకుంటూ ఆమె వెళ్ళినవేపే నడకసాగించాడు.

గుమ్మంలో నిల్చుని ఆ తండ్రీకూతుళ్ళు వెళుతున్న వేపే చూస్తూ స్థాణువులా వుండిపొయ్యాను.

ఆ ఇద్దరూ చెట్లమాటున మరుగయ్యారు. కాని ఆమె వెళుతూ వెళుతూ నిస్సహాయంగా నాకేసి చూచిన చూపులోని జాలీ, భయం, పిరికితనం నాకళ్లల్లో కదులాడుతూనే వున్నయ్.

పది నిమిషాలు గడిచిపోయినయ్.

# మతి పోగొట్టుకున్న మనిషి

"నమస్కారం బాబూ !" అంటూఆ వృద్ధుడు ప్రత్యక్షమయ్యాడు. "దార్లో మాపక్కింటి ఆడ కూతురు కనిపిస్తే తోడిచ్చి పంపాను. కూడా మనిషి లేకపోతే ఎటెళుతుందో చెప్పలేం బాబూ" అన్నాడు పై పంచెతో కళ్ళుతుడుచుకుంటూ.

"మీపేరు ?" ప్రశ్నించాను.

"ముసలయ్యండి" తలవొంచుకునే జవాబుచెప్పాడు.

"లోపలికిరా ముసలయ్యా !" అంటూ వెనక్కి తిరిగి హాల్లోకి దారితీశాను.

ముసలయ్య నా వెనకాలే హాల్లోకి చేరుకున్నాడు. కూచోమన్నట్టు కుర్చీచూపి, ఎదురుగావున్న వాలు కుర్చీలో నేను వాల్చాను. కాని ముసలయ్య కుర్చీలో కూచోలేదు. పక్కనే వున్న బెంచీమీద కూచున్నాడు.

"ఆమె ఎందుకలా అయింది?"అని ప్రశ్నించాను.




"అదంతా పెద్దకథబాబూ"అంటూ పైపంచెతో మీసాలు తుడుచుకున్నాడు ముసలయ్య. "ఒకప్పుడు మాది బాగావున్న కుటుంబమే బాబూ. ఆరెకరాల మాగాణి, నాలుగెకరాల కొబ్బరితోటా వుండేది. నలుగురు జీతగాళ్ళు ఎప్పుడూ నాకిందపనిచేసే వాళ్ళు. లేక లేక పుట్టిన సంతానం వనజ. ఒక్కగానొక్క కూతురు కావడం మూలాన అల్లారుముద్దుగానే పెరిగింది. కొండమీదికోతిని కోరినా తెచ్చి ఇవ్వాలిసిందే ! అంత అల్లారుముద్దుగా పెరగడంవల్లనే ఏమో, రణపెంకెగా తయారయింది. తనుపట్టిన పట్టు సాధించేదాకా ఒదిలేదికాదు. దాని అల్లరికి అంతంటూ వుండేదికాదు. స్కూలు ఒదలగానే తిన్నగా ఇంటికి వచ్చేదికాదు. స్నేహితురాండ్రను వెంటబెట్టుకుని మా కొబ్బరితోటమీదపడేది. కొబ్బరి బొండాలు కొట్టించుకుతాగేది. జాంకాయలూ, మామిడి పిందెలూ దాని ధాటికి ఆగేవికావు. తోటంతా ధ్వంసంచేసి, సాయంత్రం దీపాలు పెట్టేక కాని ఇల్లు చేరుకునేదికాదు.

"వయసు మీదికొస్తున్నాదాని అల్లరి తగ్గిందికాదు. ఆడపిల్లకి అల్లరి పనికిరాదని దండించబోతే, వాళ్లమ్మ అడ్డొచ్చేది. 'ఒక్కగానొక్క బిడ్డ ! అది అల్లరి చెయ్యకపోతే మరెవరు చేస్తారు ? ఆడపిల్ల ఎంత అల్లరి చేసినా వో అయ్యచేతిలోపెట్టే దాకేగా ?' అనేది.

"మాతోటంటే—వూళ్లోంచి ఇక్కడికి వచ్చేప్పుడు దార్లో, కాలవగట్టున కనిపిస్తుంది చూశారూ అదే !" అన్నాడు ముసలయ్య.

'అలాగా ?' అన్నట్టు తలూపాను.

'దాదాపు ఆరేళ్లక్రితం జరిగిన సంఘటన. వనజ అప్పుడు స్కూలు ఫైనల్ చదువుతోంది. ఈడేరి రెండేళ్లుదాటుతున్నా దాని అల్లరి తగ్గలేదు. ఇంకా చిన్నపిల్లలాగే తిరిగేది. ఒకనాడు చాలాపొద్దుపోయిం తరువాతగాని ఇల్లు చేరుకోలేదు. "ఈడేరిన పిల్లని ఇంటిపట్టున వుండక పొద్దుపోయాక్కూడా పెత్తనాలేనా ?" అని వాళ్లమ్మ కసిరితే, తిండి తినకుండా ముసుగుతన్ని పడుకుంది. కాని మరుసటి రోజునుంచీ మామూలే. రోజూ బాగాపొద్దుపోయాకగాని ఇల్లుచేరుకునేదికాదట. ఈ విషయం నాకు తెలిస్తే కోప్పడతానన్న భయంతో వాళ్లమ్మ నాకు చెప్పేది కాదు. ఎంతకాలంగా ఇలా జరుగుతోందో నాకు తెలీదు.

"ఆరోజు నేను పొలంలోంచి తిరిగొస్తున్నాను ఇంటికి. దార్లో కలుసుకున్నాడు రాఘవయ్య. 'ఏమీ అనుకోనంటే మీకో విషయం చెప్పాలి బాబయ్యా' అన్నాడు, చేతులు నలుపుకుంటూ 'ఏమీ అనుకోన్లే చెప్పు ! ఏమిటది ?' అన్నాను అసలు విషయమేమిటో తెలుసుకుందామని.

"పొరుగూరి నుండి కుర్రాపీసరొకాయన రెస్టుహవుసులో దిగారు. రెండువారాలయింది వారు దిగి. మరి, మన వనజమ్మకీ ఆయనకీ ఎలాపేటీ కుదిరిందో తెలీదు. రోజూ సాయంత్రం ఆ ఇద్దరూ మన తోటలోకలుసుకుంటారు. పొద్దుపొయ్యేదాకా కబుర్లు చెప్పుకుంటూ కూచుంటారు. వనజేమో పెళ్ళికావలసిన పిల్ల. మనదేమో పరువుగా బతుకుతున్న కుటుంబం. అల్లరిపాలు గాకుండా ముందుగా జాగ్రత్త పడ్డం మంచిది బాబయ్యా!" అన్నాడు రాఘవయ్య.

"రాఘవయ్య మాటలు వింటుంటే నాబుర్ర గిర్రున తిరిగిపోయింది. ఆవేశం హద్దులు దాటింది. దారి మార్చితిన్నగా తోటవేపుబయలుదేరాను.

రాఘవయ్య చెప్పింది అబద్ధం కాదన్న విషయం తేలిపోయింది. నేను తోటలోకి చేరుకునేసరికి అదీ ఆకుర్రాఫీసర్ ఒచెట్టుకిందకూచుని కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటున్నారు. అదృశ్యం చూసేసరికి కోపంతో నా శరీరం కుతకుతలాడి

(40 వ పేజీ చూడండి)



## మరపురాని క్షణాలు

## మీరెలా ఉండాలను కుంటారో బిన్నీకి తెలుసు



మీ అభిష్టానికి అనురూపంగా మీ పనులలో తోడ్పడే ఉత్తేజ పూరితమైన రకరకాల టెరీన్ బ్లెండ్లను బిన్నీ సమర్పిస్తోంది. ముఖ్యంగా మరపురాని మధుర క్షణాలకు అనువైనది.

**బిన్నీ** TERENE® బ్లెండ్స్

®ఇది కేపీ యొక్క రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్

**మేము చాలా మారి పోయినాము-మీ లాగానే !**

Interpub/BB/47/74 tel

# బంగారు కలలు

## యద్దనపూడి సులోచనారాణి

### 41

(గత సంచిక తరువాయి)

రాజారావుగారు నోట్లో సిగార్‌తో, చేతిలో పేపరు చూస్తూ, సోఫాలో కూర్చుని వున్నారు. ఇంతలో హాలులో వున్న ఫోన్ గణగణా మోగింది. ఆయన క్షణంసేపు దానివైపు విసుగ్గా చూసి, లేచి వచ్చి రిసీవర్ తీసారు.

'హలో!'

'హలో! నమస్కారమండీ! నేను రవిని మాట్లాడుతున్నాను.' అవతల నుంచి వినిపించింది.

ఆ కంఠం వినగానే ఆయన నిటారుగా అయారు.

'ఊ! ఏమిటీ?' గద్దించినట్టుగా అడిగారు. ఆ అడగటంలో క్రింది వుద్యోగితో మాట్లాడేటప్పటి నిర్లక్ష్యం – అధికారం ప్రతిధ్వనించాయి.

'జ్యోతితో మాట్లాడాలి. కాస్త పిలుస్తారా?'

'షటప్! మా అమ్మాయి ముందుకు వచ్చి నిలబడే అర్హత కూడా నీకు లేదు. నువ్వు సింగపూర్ నుంచి వ్రాసిన వుత్తరం నాకే అందింది! నువ్వు మాకే వివరాలూ చెప్పనవసరం లేదు. యింకోసారి ఎప్పుడైనా మా అమ్మాయి పేరు ఎత్తావో విల్ షూట్ యూ!' గర్జించినట్టుగా అని ఆయన ఫోన్ పెట్టేసారు.

ఏదో పనిమీద అటువచ్చిన జ్యోతి, తండ్రి ఫోన్‌లో ఎవరినో షూట్ చేస్తానంటం విని, ఆశ్చర్యంగా, 'ఎవరు డాడీ?' అంది.

'ఎవరా? యింకెవరు? వాడే? రవి.'

'డాడీ!' జ్యోతి కళ్లలో బాధ రెపరెపలాడింది. 'రవి ఫోన్ చేసాడా? ఏమన్నాడు?' ఆదుర్దాగా అడిగింది.

''ఏమంటాడు! ఏదో చెప్పాలిట! మనం వింటే సవాలక్ష చెప్పేట్టు వున్నాడు. నువ్వు నాకేం చెప్పక్కర్లేదు. మళ్లీ ఫోన్ చేయద్దని చెప్పాను. జ్యోతీ! నీక్కూడా చెబుతున్నాను! రవి విషయంలో నేను చాలా పొరబడ్డాను! గాజుముక్కని వజ్రమని భ్రమసి, అది నీకు నగగా శోభిస్తుందనుకున్నాను! నా పొరపాటు తెలిసింది! నిన్నుకూడా తెలుసుకోమంటున్నాను.'

'డాడీ!'

'ఒకప్పుడు—అతని అసలు స్వరూపం తెలుసుకోలేక, స్నేహితుడి కొడుకు అనే మమకారంతో ఎంతో అభిమానించాను! నిన్నిచ్చి పెళ్లి చేసి, యీ యింటికి, నా ఆస్థికి యజమానిని చేద్దామని వుబలాటపడ్డాను! అతనిలో నాకు కన్న కొడుకు లేడనే కొరత తీరిపోతుందని ఆశించాను. ఇప్పుడు అతని పేరు తలవాలంటేనే అసహ్యం వేస్తోంది నాకు!'

'మీరు తొందరపడుతున్నారేమో డాడీ!'

'లేదమ్మా లేదు! అతని విషయం చాలా కుంభకోణంగా వుంది. తీసినకొద్దీ ఒక్కొక్కటీ బైటపడుతున్నాయి! ఇది నీకు తెలుసా? వేణుని యింట్లోంచి వెళ్లగొట్టాడుట! చిదంబరంమీద చెయి చేసుకున్నాడుట! వేణు రవిమీద దావా వేసాడు! స్వంత తమ్ముడు, అతనిలో ఏ లోపమూ లేందే, అన్యాయంగా, కోర్టుకి ఎందుకు ఎక్కిస్తాడమ్మా! యిది యింతటితో ఆగిందా! రేపు కోర్టులో, యితను వుంచుకున్న దాని అసలు భర్త, వచ్చి యితని బండారం అంతా బైటపెడుతున్నాడు! ఛి—ఛీ! తలుచుకుంటేనే సిగ్గుచేటు! మనకి తెలిసినవాళ్లని ఎవరన్నా చెప్పకున్నా అప్రతిష్ట! ఇదంతా, ఆ పురుషోత్తం ఎలా సహిస్తున్నాడోగానీ, నేనయితే నరికి ముక్కలుచేసి వుండేవాడిని!'

జ్యోతి నిట్టూర్పు అపుకుంటూ తన గదిలోకి వెళ్లిపోయింది! తండ్రి స్వభావం జ్యోతికి బాగా తెలుసు! ఆయనకి పై పై వాక్యాలు, నటనలు, మొహమాటాలు తెలియవు! రవిపట్ల ఆయన మనసు విరిగిపోతే యిక ఆ భగవంతుడు చెప్పినా వినడు. జ్యోతి మంచంమీద ఆలోచనగా కూర్చుండిపోయింది! ఎంతో ఆనందంగా, వెన్నెలలు విరజిమ్ముతుందనుకున్న జీవితంలో, హఠాత్తుగా యిలా కారుమబ్బులు ముంచుకువచ్చాయేమిటి? రవి మాటలు, అతని స్పర్శ గుర్తుకువస్తేనే ఎలాగో వుంది! అతని నవ్వు ఎంత నిష్కల్మషంగా వుంటుంది! మనసులో అంత భయంకరమైన గతం దాచుకున్న మనిషి అయితే, అలా వుండగలడా! ఏమో! ఏమీ లేకపోతే అప్పుడు పెళ్లికి ఎందుకు గడువు పెట్టినట్టు! ఈలోపల ఏదో రకంగా ఆ అమ్మాయిని వదుల్చుకోవచ్చునను కున్నాడా? ఏమో! ఈ భయంకర సత్యాలేమిటో, అవి ఎంతవరకూ నిజమో, ఒక్కసారి, స్పష్టంగా, రూఢిగా తెలిసిపోతే ఎంత బాగుండును!

దిండుమీద తల ఆనించుకున్న జ్యోతికి ఒక్కసారి పది సంవత్సరాలు ఎదిగిపోయినట్టుగా, అనిపించసాగింది!

### 42

వేణు రవిమీద దావా వేసిన సంగతి, అందరికీ తెలిసిపోయింది! ఇందులో ఒక అమ్మాయి కూడా వుందని, రవి అమ్మాయిని రహస్యంగా ఎక్కడో దాచి కాపురం చేస్తున్నాడనికూడా అందరూ చెవులు కొరుక్కోసాగారు. ఒకళ్లిద్దరు, పట్టలేక రవిని ముఖానే, 'మీ తమ్ముడు దావా ఎందుకు వేసాడు?' అని అడిగేసారుకూడా! రవి, వేణుకేం తెలియదని, మామగారి చేతిలో కీలుబొమ్మ అయాడని చెప్పాడు. విన్నవాళ్లు అతని మాటలు ఏమాత్రం నమ్మలేదు! పైకిమాత్రం 'ఓహో! అలాగా!' అన్నా, రవి వెళుతుంటే వెనకనుంచి ఎగాదిగా చూసేవాళ్లు.

ఒకపక్క వేణూతో దావా, మరోపక్క ఫాక్టరీ కోసం తెచ్చిన డబ్బు, వాయిదాలు తీర్చాల్సిన మొత్తం బకాయిపడటం, యింకోపక్క రాజారావు గారితో సంబంధ బాంధవ్యాలు తెగిపోవటం రవికి పిచ్చి ఎక్కించేట్టుగా వుంది. అతనిలో రేగుతున్న ఈ దావానలం తాటాకు సెగలు దహించివేస్తున్నా, పైకిమాత్రం నిండుకుండలా, గాంభీర్యం చెక్కు చెదరకుండా పన్నులు నెరవేరుస్తున్నాడతను.

ఆరోజు కోర్టులో కేసు జరుగుతోంది.

వేణు బోనులో నిలబడివున్నాడు.

వాది తరఫు న్యాయవాది అతన్ని ప్రశ్నిస్తున్నాడు.

'మిష్టర్ వేణూ! మీరు మీ అన్నగారి మీద దావా వేయటానికి గల ముఖ్యకారణం ఏమిటో చెబుతారా?'

'దారితప్పి దుర్వ్యసనాలకి లోనయిన వాడికి బుద్ధిచెప్పటం నా ముఖ్యోద్దేశ్యం!'

'దుర్వ్యసనాలంటే?'

'ఒక అమ్మాయితో అక్రమ సంబంధం పెట్టు

**జరిగిన కథ: 14** రవి, వేణు పురుషోత్తంగారి కుమారులు. సరోజ, డాక్టర్ ప్రసాద్‌లు కూడా పురుషోత్తంగారివద్ద పెరిగారు. పురుషోత్తంగారి చిన్ననాటి స్నేహితుడు రాజారావుగారి సాయంతో ఫ్రూట్ కానింగ్ ఇండస్ట్రీ స్థాపిస్తాడు రవి. ప్రేమించిన శేషగిరిచే మోసగింపబడి ఆత్మహత్యకు పూనుకున్న సరోజ ఎలా క్లబ్‌డాన్సర్‌గా మారిందీ రవికి చెప్తుంది. జైలునుంచి విడుదలయిన శేషగిరి సరోజ సంపాదనంతా కాజేసాడని రవిని నిందిస్తాడు. సరోజ 'నర్స్' అవుతుంది. చిదంబరం ఎత్తుగడతో రాధ వేణుల వివాహం జరిపిస్తాడు రవి. శేషగిరి నాటిన విషబీజంతో రాజారావుగారు నిశ్చయించిన సంబంధాన్ని జ్యోతి రవిని వారికి పరిచయం చేసి చెడగొడుతుంది. రవి ఫ్యాక్టరీ బాధ్యత చిదంబరానికి అప్పగించి సింగపూర్ వెళతాడు. రవితో వివాహానికి రాజారావుగారు అంగీకరించకపోవటంతో క్షోభ చెందుతుంది జ్యోతి. శేషగిరి సరోజను వేధిస్తుంటాడు. రవి జీతాలిమ్మని డబ్బు ఇచ్చినా చిదంబరం జీతాలు ఇవ్వకపోవటంతో కార్మికులు సమ్మె ప్రారంభించారు. చిదంబరం వేణుల దుర్బుద్ధి తెలుసుకున్న రవి వారిని ఇంట్లోంచి వెళ్లగొడతాడు.

కుని, ఒక బిడ్డను కూడా కని, [illegible] బిడ్డని కాన్వెంట్‌లో వుంచి చదివిస్తున్నాడు. మా ఫాక్టరీ మీద వచ్చిన డబ్బంతా, ఆ తల్లికీ బిడ్డకీ పెట్టి నాశనం చేస్తున్నాడు.'

'మీరు అతన్ని వారించటానికి ఏమైనా ప్రయత్నాలు చేశారా?'

'ఎన్నోవిధాల చెప్పిచూసాను. నా మాట వినలేదు. పైనుంచి నామీద చెయి చేసుకుని, యింట్లోంచి మెడబట్టి గెంటాడు. వాడిని యిక బాగుచేయలేనని భయపడిన నేను, నా భవిష్యత్తు, నా క్షేమం దృష్టిలో పెట్టుకుని, యిలా కోర్టుకి ఎక్కాల్సి వచ్చింది!' వేణు ముఖం చూస్తే తప్పనిసరిగా గత్యంతరంలేక ఈ పని చేసినట్టుగా వుంది.

'దట్సాల్ యువరానర్!' వాది తరపు అడ్వకేట్ తను అడగటం పూర్తి అయినట్టుగా కూర్చున్నాడు.

ప్రతివాది అడ్వకేట్ లేచాడు. ఆయన వయసు మళ్లిన వ్యక్తి! ఆయన వేణు నిలబడిన బోను దగ్గరకి వచ్చి, అతన్ని ఒకసారి, రెప్ప వాల్చకుండా సూటిగా చూసాడు.

వేణు ఆయన చూపులకే అదోలా అయాడు.

'మిష్టర్ వేణూ! ఫాక్టరీ పెట్టకముందు మీ అప్పులన్నీ పొలం అమ్మి తీర్చారు కదూ!'

'అవును సార్!'

'ఆ తర్వాత మీ అన్నయ్య యీ ఫాక్టరీని అప్పు చేసి ప్రారంభించాడు అవునా?'

'కొంత డబ్బు తీసుకురావటం మాత్రం నాకు తెలుసు.'

'మీ పొలం అమ్మిన డబ్బు కూడా యిందులో జాయింట్ పెట్టుబడిగా పెట్టారంటారు మీరు? అంతేనా?'

'అంతే ఏమిటి? అది నిజం!'

'ఫాక్టరీ బాగా సాగుతోంది కదూ?'

'భగవంతుడి దయవల్ల బాగానే సాగుతోందండీ!'

'ఈ ఫాక్టరీ మేనేజరు ఎవరు?'

'చిదంబరంగారని —'

'మీ మామగారేగా!'

'అవును. ఆయని కూతురుని నేను చేసుకున్నాను.'

'ఊ! మీరు బాగా ఖర్చు పెట్టే మనిషి అని విన్నాను.'

'అబ్బెబ్బె! అదేం లేదండీ!'

'బుకాయించకండి! క్రిందటి ఆదివారం మీరు గండిపేటలో స్నేహితులకి యిచ్చిన పార్టీకి ఐదారు వందలు తక్కువ ఖర్చయివుండదు! అబద్ధం అంటారా?'

'అదా! అది —' వేణు నీళ్లు నమిలాడు.

'అది నా పుట్టిన రోజండీ!' అన్నాడు.

'సరే! ఆ విషయం వదిలేయండి. మీరు డబ్బు అవసరం అయినప్పుడు ఏం చేసేవారు? మీ అన్నగారిని అడిగేవారా?'

'ఉహూ! మా మామయ్యే యిచ్చేవాడు!'

'మీరు దానికి రసీదులాటిది యిచ్చేవారా?'

'యిచ్చేవాడిని!'

'యివ్వకుండా ఎప్పుడూ తీసుకునేవారు కాదా!'

'ఉహూ!'

'మిష్టర్ వేణూ! మీరూ మీ మామగారూ కలిసి, ఫాక్టరీలో డబ్బంతా కాజేసారంటాను!'

'అబద్ధం! పచ్చి అబద్ధం!' వేణు ఆవేశంగా అరిచాడు.

'మీ మామగారయిన చిదంబరం యిదివరకు లంచం తీసుకోగా, ఒకటి రెండు చోట్ల వుద్యోగం పోయిన మాట కూడా అబద్ధమేనా?'

'అది నిజమే! కానీ మా ఫాక్టరీలో డబ్బు మాత్రం ఆయన కాజేయలేదు.'

'దట్సాల్ యువరానర్!' లాయరుగారు వాదన పూర్తి చేసారు. వేణు ముఖంనిండా పట్టిన చెమటలు తుడుచుకుంటూ బోనులో నుంచి దిగాడు.

## 43

కోర్టు ఆవరణబైట చిదంబరం శేషగిరి చేతిలో రహస్యంగా, వందరూపాయిల కాగితం పెట్టాడు.

'శేషగిరీ! ఈ కేసంతా నీ సాక్ష్యంమీదనే ఆధారపడివుంది. ఎలా చెబుతావో ఏమో!' అన్నాడు.

'మీకెందుకు? మీరు నిశ్చింతగా ఉండండి. ఆ లాయర్లని బోల్తాలు కొట్టించి, కేసు మీచేత గెలిపించే పూచీ నాది!'

'నిన్నే నమ్ముకున్నాను శేషగిరీ!'

'నాకు ఆస్తిలో వాటా యిస్తానన్న మాట నిజమేగా!'

'భగవంతుడి సాక్షిగా!'

ఇంతలో బంట్రోతు పిలవటం వినిపించింది.

'బొంగరాల శేషగిరిరావుగారు! బొంగరాల శేషగిరిరావుగారు!'

'ఆ! నేనే! వస్తున్నా! అబ్బ! పేరంతా పిలిచి ఖూనీచేసావు కదయ్యా! చక్కగా బి. యస్. గిరీ అని పిలవకూడదూ?' అని బోనులో ఎక్కి అంతా నిజమే చెబుతానని ప్రమాణం చేసాడు.

చిదంబరం ఒళ్లంతా, కళ్లు, చెవులూ చేసుకుని కూర్చున్నాడు.

శేషగిరి దగ్గరకి వాది తరపు అడ్వకేట్ వచ్చాడు.

'చూడు మిష్టర్ గిరీ! మీకు పెళ్లి అయిందా?'

'అయిందండీ!'

'ఇప్పుడు మీ భార్య మీతోనే వుంటున్నారా?'

శేషగిరి తల వంచుకున్నాడు.

'చెప్పండి! ఆవిడ యిప్పుడు మీతో కాపురం చేస్తున్నారా?'

శేషగిరి బేలగా చూసాడు.

'ఏం చెప్పమంటారు! [illegible] విషయం యిలా



నలుగురిలో చెప్పుకోవాలంటే ప్రాణం చచ్చిపోతోంది.' అంటూ ఏడవటం మొదలుపెట్టాడు.

'ఏడవకండి! అడిగినదానికి సమాధానం చెప్పండి.'

'క్షమించండి.' శేషగిరి కళ్లు తుడుచుకున్నాడు.

'ఏడుపుతప్ప నాకు మిగిలిందేమిటండీ! ఏ మగాడైనా నా భార్య లేచిపోయిందీ అని ఏడుస్తూ గాకుండా, నవ్వుకుంటూ చెప్పగలడా!'

'లేచిపోయిందా? ఎక్కడికి.'

'ఎక్కడికో చెప్పాలంటే దానిముందు చాలా కథ వుందండీ!'

'ఏమిటది? చెప్పండి.'

'ప్రేమించి పెళ్లి చేసుకున్న మా యిద్దరి కాపురం హాయిగా, సుఖంగా సాగిపోతోందండి! అప్పుడప్పుడూ ఎక్కువ డబ్బు లేదని, నేను తనకి నగలు చేయించలేదని, మా యిల్లు పెద్దది కాదని, నాకు గొప్ప వుద్యోగం లేదని సణుగుతూ వుండే దనుకోండి! నేనేదో నచ్చ చెప్పుకునేవాడిని! మా యింటికి అప్పుడప్పుడూ చుట్టపు చూపుగా యీ రవి వచ్చి పోతూ వుండేవాడు! నాకు సహజంగా బంధుప్రీతి ఎక్కువ. వచ్చినప్పుడల్లా మా యింట్లో భోజనం చేయమని బలవంతం చేసేవాడిని! ఏమో సాటివాడు కదా అని గుడ్డిగా నమ్మానే తప్ప, యిలా నా వెనక గొయ్యి తవ్వుతాడని అనుకోలేదు. నేను వూళ్లో లేనప్పుడు కూడా, ఒకటి రెండు సార్లు రవి వచ్చి వెళ్లినట్టుగా, నా భార్య చెప్పింది. నా కసలు అనుమానమే రాలేదు! తర్వాత — తర్వాత — రవి రాకపోకలు ఎక్కువైనాయి. వాళ్లిద్దరి చూపులు, ద్వంద్వార్థం మాటలు నా కెలాగో అనిపించసాగినాయి. కానీ మళ్లీ నన్ను నేనే తిట్టుకున్నాను. ఈర్ష్యతో నేను అలా అపోహ పడుతున్నానేమో అని మందలించుకున్నాను. ఒకసారి ఆ యిద్దర్నీ వంటరిగా వున్నప్పుడు పరీక్ష చేస్తే సరిపోతుందని నిశ్చయించుకున్నాను.

ఆ రోజు మా యింటికి రవి వచ్చాడు. నేను వూరు వెళుతున్నానని బైలుదేరాను. కావాలనే రాత్రి పొద్దు పోయిన తర్వాత, యింటికి తిరిగివచ్చాను.' శేషగిరి ఆగిపోయాడు.

అతను చెప్పే తీరు వినేవాళ్లకి, చాలా కుతూహలం రేకెత్తించింది.

'ఊ! తిరిగి వచ్చేసరికి [illegible] చెప్పండి.' [illegible] గారు అడిగారు.

శేషగిరి తల [illegible] మళ్లీ! అతని గొంతు భారమైపోయింది. చెప్పలేక చెబుతున్నట్టుగా వివరించసాగాడు.

'తిరిగి వచ్చేసరికి — యిద్దరూ — ఆ యిద్దరూ — నా మంచం మీద — ఒకరి కౌగిలిలో మరొకరు ఈ ప్రపంచమే మర్చిపోయి [illegible] వున్నారు. నా భార్య అతని జుట్టు చెరుపుతూ నవ్వుతోంది —'

'ఊ! వివరాలు చాలు! అలా యిద్దరూ అతి సన్నిహితంగా వుండటం చూసిన వెంటనే మీరేం చేసారు.'

'ఏం చేసానా!' శేషగిరి ముఖంలో ఆవేశం పొంగింది.

# బంగారు కలలు

'ఆ యిద్దర్నీ ఆ క్షణంలో గొంతు పిసికో, గోడకేసి తలలు బద్దలుకొట్టో చంపుదామన్న ఆవేశం వచ్చింది! కోపం పట్టలేక వెళ్లి రవి జుట్టు పట్టి మంచంమీద నుంచి యివతలికి లాగాను. నేను చేయి ఎత్తి ఒక దెబ్బ వేశానో లేదో అతను నన్ను పది దెబ్బలు కొట్టాడు! నాకు పిచ్చికోపం వచ్చింది! ఈరోజు నేనో నువ్వో ఎవరో ఒకరే బ్రతకాలి అన్నాను. నేను అతన్ని కొట్టబోతుండగా, ఇంతలో వెనకనుంచి నా తలమీద ఫెడేల్మి దెబ్బతగిలింది! నా కళ్ల చీకట్లు కమ్మినాయి! గిరగింతలు తిరుగుతూ వెనకకు చూసాను! ఎదురుగా సరోజ పచ్చడిబండతో నిలబడింది! రక్తం నా ముఖం మీదకి కారుతోంది! నా కళ్లు తిరిగిపోయినాయి! నేను సరోజ కాళ్లదగ్గర కుప్పలా కూలిపోయాను! నాకు మళ్లీ మెలకువ వచ్చేసరికి యిద్దరూ లేరు!'

'ఆ సంఘటన తర్వాత మళ్లీ వాళ్లిద్దరూ కలిసివుండగా మీరెక్కడైనా చూసారా!'

'సరోజ చాలారోజులు నాకు కనిపించలేదు. రవిని వెళ్లి అడిగితే, సరోజని నువ్వే ఏదో చేసావని పోలీసులకి రిపోర్టు యిస్తానని బెదిరించాడు! తర్వాత నాకు విరక్తి పుట్టిపోయింది! అంత నామీద యిష్టంలేనిదాన్ని కసాయివాడిలా తెచ్చుకుని బలవంతంగా కాపురం చేయాల్సిన ఖర్మ నాకేమిటి అనుకున్నాను. అప్పటినుంచీ నా బ్రతుకు నేను బ్రతుకుతున్నాను! యీ బాధ భరించలేక తాగుడికి అలవాటుపడ్డాను. వాళ్లిద్దరికీ ఒక బిడ్డ పుట్టిందని, రవి రహస్యంగా పెంచుతున్నాడని తెలిసింది! నాకు అన్యాయమే జరిగింది! కానీ ఆ అన్యాయాన్ని ఎదుర్కొనే డబ్బుగాని. అండగాని నాకు లేవు! నేను పేదవాడిని! అందుకని ఈ మంటలు గుండెల్లోనే దాచుకున్నాను!' శేషగిరి చెప్పటం పూర్తి అయేసరికి వినేవాళ్లుకూడా నిట్టూర్పు విడిచారు.

**త్వరలో**
**చిదంబర రహస్యం**

'దట్సాల్ యువరానర్.' వాది తరపు న్యాయవాది జడ్జిగారితో అని వెళ్లి సంతృప్తిగా కూర్చున్నాడు.

[illegible] వింపిరి[illegible] అయింది. శేషగిరి [illegible] కళ్లు తుడుచుకుంటూ నిలబడ్డాడు.

ప్రతివాది తరఫు న్యాయవాది, లేచి కళ్లజోడు సరిచేసుకుంటూ [illegible] దగ్గరకి వచ్చాడు.

ఆయన శేషగిరిని తీక్షణంగా, నఖశిఖ పర్యంతం చూసాడు. కానీ శేషగిరి ఆ చూపులకి కించిత్తు కూడా [illegible] నిటారుగా నిలుచున్నాడు.

[illegible] వృద్ధు గంభీరంగా అడగటం ప్రారంభించాడు.

'శేషగిరిగారూ! మీది ప్రేమ వివాహమా?'

'మొదట నేను యిద్దరం ప్రేమించుకున్నాము అండీ! తర్వాత [illegible] పెద్దలు పెళ్లి చేసారు.'

'అంటే మీ భార్య మిమ్మల్ని ప్రేమించి చేసుకుందన్న మాటేగా!'

'బుద్ధి గడ్డితిని అలాగే నమ్మానుసార్!'

'మీరు వూరు వెళతానని తిరిగివచ్చిన రాత్రి, రవి — సరోజ మిమ్మల్ని కొట్టారని మీరు చెబుతున్నారుకదా! మరి మీరు పోలీసు రిపోర్టు ఎందుకు యివ్వలేదు?'

'రిపోర్టా! సిగ్గులేక ఏ ముఖం పెట్టుకుని యివ్వమంటారండీ! నా సంసారం అల్లరి అయిపోతుందని, నా భార్య చెడిపోయిన మనిషి అని అందరూ తర్వాత నన్ను వెక్కిరిస్తారని భయపడ్డాను!'

'అబద్ధం! మీరే మీ భార్యని హింసించేవారని, ఆమెని సరిగ్గా చూడక, కొట్టి, తిట్టి వెళ్లగొట్టారని, అప్పటికే ఆమె గర్భవతి అని బుజువు లున్నాయి!' ప్లీడర్‌గారి కంఠం ఖంగుమంది.

కానీ శేషగిరి రవంతకూడా బెదరలేదు.

'ఆ! ఈ రోజుల్లో బుజువులకేంలెండి! కడుపు కక్కుర్తి గల ఎవరైనా, పదిరూపాయలు పడేస్తే, చిలకల్లా చూసినట్లే మాటలు వల్లిస్తారు.' తేలికగా తీసిపారేసాడు.

'బుకాయించకు! రవికి పుట్టిన బిడ్డ అంటున్నావు! [illegible] బిడ్డ నీ బిడ్డే.'

'రామరామ యిదేం మాటండీ! న్యాయం చేకూర్చవలసిన పెద్దవాళ్లు! మీరే యిట్లా అన్యాయం న్యాయంగా, అబద్ధం నిజంగా మార్చేస్తే యిక మాలాటి వాళ్లకి న్యాయం ఎక్కడ జరుగుతుందండీ! [illegible] బిడ్డ నాబిడ్డ అయితే సరోజని చంపి అయినా, నా బిడ్డని నాదగ్గరకి తెచ్చుకునేవాడిని! అయినా అసలు కావాలని ప్రేమించి పెళ్లి చేసుకున్న భార్యని, కడుపుతోండగా, ఎవరైనా వెళ్లగొడతారా? చాల్లే వూరుకోండి! ఎవరైనా వింటే నవ్వుతారు!'

శేషగిరి అన్న ధోరణికి కోర్టులోవున్న అందరూ గొల్లున నవ్వారు.

## 44

జ్యోతి సోఫాలో కూర్చుని పుస్తకం చదువుకుంటోంది. సింహాచలం వచ్చి, 'అమ్మాయిగారూ! మిమ్మల్ని కలవటానికి ఎవరో వచ్చారండీ!' అన్నాడు.

'రమ్మను లోపలకి.' అంది పుస్తకం పక్కన పెడుతూ.

కొద్ది నిముషాల తర్వాత — బెదురుగా, లోపలకి [illegible] సరోజని చూసి, జ్యోతి ఆశ్చర్యపోయింది.

'[illegible]! రండి. రండి. కూర్చోండి.' [illegible]

'[illegible] తెలుసా?' సరోజ [illegible]

'భలేవారే! మీరు తెలియకపోవటం ఏమిటి! [illegible] స్టోర్‌లో మీ డాన్సు నేను [illegible] చూసాను. మీరు [illegible]!'

'[illegible]! రోజానే! కానీ నా అసలు పేరు సరోజ!'

'అలాగా! ఊ! చెప్పండి. ఏం పనిమీద వచ్చారు? నాన్నని పిలవనా?' జ్యోతి లేవబోయింది.

'వద్దు వద్దు. కూర్చోండి! నేను మీతో మాట్లాడాలనే వచ్చాను.'

'నాతోనా!' జ్యోతి లేవబోతున్నదల్లా ఆగింది.

[ఇంకా వుంది]




## ఆరు జంటల కథ

ఇది సినిమా పేరు మాత్రం కాదు. సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్ "అంతం చూసిన అసూయ" నవలాధారంగా నిర్మిస్తున్న చిత్రంలో ఆరు జంటలున్నాయి. ఈ చిత్రానికి భమిడిపాటి, చలపతిరావు, శేఖర్ — సింగ్, బి. ఎస్. కృష్ణ, బి. గోపాలం ముఖ్య అంగాలు. సినిమా అనువాదం + దర్శకత్వంను కె. హేమాంబరధరరావు చేపట్టారు. ఇందులో నటిస్తున్న ఆరు జంటలు : జమున — శ్రీధర్, కాంచన — కృష్ణంరాజు, లక్ష్మి — చంద్రమోహన్, ? — రాజబాబు, పండరీబాయి—ప్రభాకరరెడ్డి, రాధాకుమారి — కాకరాల.

ఈ చిత్రాన్ని జనాకర్షణీయంగా రూపొందిస్తున్నారు. ముఖ్యంగా సంగీతంపట్ల చలపతిరావు ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నారు. స్వర్గీయ శ్రీరంజని నటించిన ఆఖరు చిత్రం యిది. ఇప్పటికి ఆరు రీళ్ల చిత్రం తయారైనట్లు నిర్మాత హేమాంబరధరరావు చెప్పారు.



"దీక్ష"లో రామారావు, అపర్ణ

## ప్రభాకరరెడ్డికి కామెడీ పాత్ర

"కథానాయకుడు" నిర్మాత కొన్నేండ్లు ఎందుకు నిర్మాణంపట్ల జోక్యం కలిగించుకోలేదో యిప్పుడు అర్థమైంది. ఇప్పుడు తమిళంలో విజయ ఢంకా మ్రోగిస్తున్న "దీర్ఘసుమంగళి"ని విడుదలకు పూర్వమే గోపాలకృష్ణ కొన్నారు.

అది ఒక పచ్చని సంసారం. భర్త చాలా మంచివాడు. క్రమశిక్షణకు ఆత్మీయుడు. కరెక్టుగా వ్యవహరించే వ్యక్తిత్వం వున్నవాడు.

భార్యకు భర్త అంటె పంచప్రాణాలు. అతడి మాటను జవదాటదు. అతనికి అణిగి, మణిగి వుంటుంది. అతడికి కోపం వచ్చినప్పుడు, ఏదో చెప్పి శాంతపరుస్తుంది. మల్లెపూలంటే ప్రాణం. అన్యోన్యానురాగ బద్ధులయిన భార్యా, భర్తలుగా జమున, కృష్ణ నటిస్తున్నారు.

ఈ చిత్రంలో ప్రభకరరెడ్డి గమ్మత్తయిన పాత్రను పోషిస్తున్నారు. తీరిక వేళల్లో వంటశాలలో తన ప్రతాపాన్ని చూపెడుతూ, భార్య రమాప్రభను నవ్విస్తూ కాలక్షేపంచేసే తమాషారాయుడి పాత్ర.

"దీర్ఘసుమంగళి" కథను సినిమా కథ అవడం అసమంజసం. నిజజీవిత కథ అనొచ్చు. ఈ చిత్రానికి ఆత్రేయ రచనను, చక్రవర్తి సంగీతాన్ని, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయను, శ్రీహరిరావు కూర్పును, బి. ఎస్. కృష్ణ కళను చేపట్టి, దర్శకత్వాన్ని కె. హేమాంబరధరరావు నిర్వహిస్తున్నారు.

## మనః క్లేశంతో విడిపోయిన ఇద్దరమ్మాయిలు

ఎంతో ప్రేమగా, ఎంతో స్నేహంగా వున్న యిద్దరమ్మాయిల నడుమ చిన్న మనః క్లేశం వచ్చింది. అది ఎంతదూరం వెళ్లిందంటే వాళ్ల స్నేహానికి పెద్ద అఘాతం ఏర్పడేంతవరకు. ఒక నిమిషమయినా విడిచి వుండలేని ఆ యిద్దరూ ఒకర్నొకరు చూడని స్థితికి రావడం జరిగింది.

ఒకామె కలెక్టరుకు భార్య అయింది. మరొకామె కలెక్టరు బంట్రోతుకు అర్థాంగి అయింది. బంట్రోతు. కలెక్టరు ప్రాణమిత్రులు. ఒకరోజున కలెక్టరు తన స్నేహితుడ్ని యింటికి ఆహ్వానించాడు. వచ్చినచోట కలెక్టరు భార్య తన అహంకారాన్ని, అధిక ప్రసంగాన్ని ప్రయోగించింది. బంట్రోతు భార్య "నీకు బుద్ధిచెప్పే రోజు దగ్గర్లోనే వుంది" అంటూ రుసరుసలాడుతూ వెళ్లింది. "కట్" అన్నారు దర్శకుడు దాసరి నారాయణరావు. ఈ ఘట్టం అల్లు రామలింగయ్య సమర్పించు "బంట్రోతు భార్య" చిత్రంలో కనిపిస్తుంది.

కలెక్టరు భార్యగా శ్రీవిద్య నటించింది. ఆమెతో సవాల్ చేసిన వనితగా విజయనిర్మల ఆ ఘట్టంలో అసాధారణంగా నటించింది. ఈ చిత్రం జూన్ 7 న నవయుగ ద్వారా విడుదల అవుతుందని నిర్మాతలు అరవింద, సత్యనారాయణమూర్తి చెప్పారు.

## రెండవ చిత్రం

గీతా ఆర్ట్స్ నిర్మించిన "బంట్రోతు భార్య" విడుదల అయ్యే అదే తేదీన, రెండవ చిత్రం షూటింగు ప్రారంభం అవుతుంది, అన్నారు కథకుడు, దర్శకుడు దాసరి.

## ఇల్లు సగం

చెయ్యడానికి కంకణం కట్టుకొన్నాడు అల్లు రామలింగయ్య. అతడు చెప్పింది వేదంగా శిరసావహించింది విజయలలిత. ఆమె మాటలకు తల వొగ్గాడు గిరిబాబు. నిర్దాక్షిణ్యంగా తండ్రిని ఎదిరించి, వున్న యింటిని రెండుగా చేశాడు గిరిబాబు.

పాపం, గుమ్మడి! అందివచ్చిన కొడుకు ఆదుకుంటాడు అనుకుంటే, అడ్డం తిరిగాడు.

చెల్లెలి కట్నం కోసం తెచ్చిన పది వేలను, రామలింగయ్య ధర్మమా అని తన దగ్గరే వుంచుకున్నాడు. దాంతో చెల్లెలి పెండ్లి ఆగిపోయింది. పెళ్ళాం చెప్పినట్టల్లా ఆడి, తల్లిదండ్రుల మనస్సును క్షోభ పెట్టాడు. చివరిక్షణకు తండ్రికి విరోధిగా ప్రవర్తించాడు. ఆఖరి చూపులకు కూడా నోచని దౌర్భాగ్యుడయ్యాడు.

తండ్రి పోయిన తరువాత కొడుక్కి బుద్ధి వచ్చింది. పోయిన తండ్రి తిరిగి వస్తాడా ? కుమిలి కుమిలి ఏడ్చాడు. తన్ను క్షమించమని వాపోయాడు. పరలోకంలో వున్న తండ్రి, కుమారుడి మొరను ఆలకించాడా ? ఏమో. ఇదంతా లావణ్యా పిక్చర్స్ వారి "అనగనగా ఒక తండ్రి" చిత్రంలో జరిగిన సంఘటన. నిర్మాత మహేష్. దర్శకుడు సి. ఎస్. రావు.

## సీతకు ఊర్వశి ప్రశంస

సావరిన్ ఎంటర్ ప్రైసెస్‌వారి "ఓ సీత కథ" చిత్రాన్ని ముఖ్యులు కొందరు చూడడం జరిగింది. వారితో మన ఊర్వశి కూడా వుంది. నిజాన్ని నిర్భయంగా చెప్పే మనసత్వం ఆమెది.

"ఓ సీత కథ అద్భుతంగా వుంది. అంత బాగా రావడానికి విశ్వనాథ్ ముఖ్య కారకుడు. ఆద్యంతం విశ్వనాథ్‌గారి ప్రతిభ కనిపిస్తుంది. ఆయన నడిపించిన విధానం ప్రేక్షకులను ఆకట్టుకుంటుంది. రియలిజం వున్న కథ యిది. ఆంధ్రుల అభిమాన ధనాన్ని ఆర్జించే కథ యిది.

పాత్రధారు లందరూ ఎంతో సహజంగా, నిజమైన పాత్రలుగా కనిపించారు. ముఖ్యంగా రోజారమణి ఎంతో గొప్పగా నటించింది. ఎవరు ఏమి చేసినా, అందులో దర్శకుడి మేధస్సు కనిపించింది." అని శారద తన మనసులోని మాటను చెప్పింది. ఆమె చెప్పిన మాటలు నూరు శాతం నిజం అని చిత్రం చూచిన తదితర పెద్దలు ఆమోదించారు. నిర్మాత శర్మ అదృష్టవంతుడు.

## శారదకు ప్రశంస

"ఓ సీత కథ" ను శారద ఎంతగా ప్రశంసించిందో పాఠకులకు తెలిపాను. శారదను పలువురు ప్రశంసించిన వైనాన్ని వివరిస్తాను.

శ్రీ లక్ష్మీ నరసింహా ప్రొడక్షన్స్ నిర్మించిన "రాధమ్మ పెళ్లి" చిత్రాన్ని పరిశ్రమలో పెద్దలు కొందరు చూశారు. అందరూ శారద నటనా ప్రాభవాన్ని మెచ్చుకున్నారు. మూడు పాత్రలను ఆమె ఎంతో నేర్పుతో, ఎంతో మేధతో నటించినట్టు చెప్పారు. కరుణరసం ఎంత చక్కగా చూపెట్టినదో, శృంగార రసం అంతకు తక్కువ గాకుండా ప్రదర్శించింది. చిలిపి రాధగా, బాధల శారదగా నటి శారద అద్వితీయంగా చేసింది. శారద తరువాత నటనలో మార్కులు తెచ్చుకొన్నది నిర్మల, సత్యనారాయణలు. నిర్మల పాత్రలో వ్యత్యాసం, పోషణలో వ్యత్యాసం కనిపించింది. కథా నాయకుడి వేషాన్ని కృష్ణ కరెక్టుగా చేసినట్టు, హాస్య జంటగా రాజబాబు, రమాప్రభ పోటీపడి నటించినట్టు సినిమా చూచిన విమర్శకులు వెల్లడించారు. రాధమ్మ పెళ్లి చిత్రాన్ని దాసరి గజిబిజి లేకుండా నడిపించినట్టు, మాటలను నారాయణరావు మణిమాటలుగా రచించినట్టు, చిత్రం రక్తి కట్టించడానికి దర్శకుడు పాటుపడినట్టు చిత్ర వీక్షకులు వివరించారు. ఈ చిత్ర నిర్మాతలు మావుళ్లయ్య, రామతారకం.



"మంచి మనుషులు"లో శోభన్, మంజుల

## శాంతి నికేతన్

నవలను సురేష్ రామానాయుడు చలన చిత్రంగా నిర్మిస్తున్నట్టు, నాయకుడి వేషాన్ని శోభన్ చేస్తున్నట్టు, ఆగస్టు నుండి షూటింగు ఆరంభమయ్యేట్టు తెలుసుకున్నాను. ఈ చిత్రానికి కె. బాపయ్య దర్శకుడు. మోదుకూరి జాన్సన్ చేత మాటలను రాయించారు. రాఘవులు సంగీతాన్ని సమకూరుస్తున్నాడు. "ద్రోహి" తరువాత సురేష్‌కి రాఘవులు పని చేస్తున్న చిత్రం శాంతి నికేతన్. ఇందులో వాణిశ్రీ నాయికగా నటిస్తుంది. ఒక ముఖ్య పాత్రను జగ్గయ్య పోషిస్తారు.

వచ్చే సంవత్సరం అక్కినేని నటించే చిత్రాన్ని రామానాయుడు నిర్మిస్తారు. 'ప్రేమనగర్' తరువాత హీరో నటించబోతున్న చిత్రం ఏదై యుంటుందో!

## బోటులో ఘాటయిన ప్రేమ

హ్యాండ్‌సమ్ శోభన్‌బాబు, గ్లామర్ మంజుల ఎండాకాలాన్ని శీతల ప్రదేశంలో గడిపారు. కాశ్మీరుకు వెళ్లి అక్కడ బోటు షికారు చేశారు. బోటులో ఘాటుగా ప్రేమించుకుని, ఎన్నెన్నో బాసలు చేసుకున్నారు. నువ్వు లేని నేనేమిటి ... నేనే నువ్వు అయినప్పుడు దిగులేమిటి అని ప్రేమికులు ఆట పాటలలో మునిగితేలారు. ఈ ఘాటయిన ప్రేమ ఘట్టం జగపతి పిక్చర్స్ వారి "మంచి మనుషులు" వర్ణ చిత్రంలో కనిపిస్తుంది. ఈ చిత్రానికి వి. బి. రాజేంద్రప్రసాద్ దర్శకుడు.

"మంచి మనుషులు" చిత్రానికిగాను మూడు పాటలను కాశ్మీరు, సిమ్లాలో చిత్రీకరించినట్టు, రెండు లక్షలు ఖర్చయినట్టు దర్శకుడు రాజేంద్రప్రసాద్ చెప్పారు. ఈ చిత్రానికి వెంకటరత్నం, సంజీవి, కృష్ణారావు లాంటి మేధావులు సాంకేతిక శాఖలను చేపట్టారు. ముఖ్య పాత్రలను జగ్గయ్య, నాగభూషణం, రాజబాబు, సత్యనారాయణ, అంజలీదేవి పోషిస్తున్నారు.



"అనగా అనగా ఒక తండ్రి"లో సావిత్రి, గుమ్మడి



"రాధమ్మ పెళ్లి"లో శారద, కృష్ణ

## దుస్తులకు లక్ష

ఫణి మాధవి కంబైన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న "దొరబాబు" చిత్రం దాదాపు పూర్తయింది. (రెండు పాటల చిత్రీకరణ తప్ప).

ఆంధ్రుల అభిమాన అగ్రనటుడు యీ చిత్రంలో అరవై రకాల దుస్తులను ధరించారు. ఆయనకు వాడిన దుస్తులకు మాత్రం లక్ష అయినట్టు, నిర్మాత రాజేంద్రప్రసాద్ చెప్పారు.

ఇందులో జనం కోరే అక్కినేని అగుపిస్తారు. శృంగారం తక్కువా? యాక్షన్ తక్కువా? ఫైట్లు తక్కువా? డ్యాన్సులు తక్కువా? కరుణ రసం తక్కువా? ఏదీ తక్కువగాకుండా, మోతాదు మించకుండా వున్న చిత్రం "దొరబాబు." వీటన్నిటికీ పరిపూర్ణ న్యాయం చేకూర్చారు నాగేశ్వరరావు.

దొరబాబును జనాకర్షణీయంగా రూపొందించడానికి దర్శకుడు తాతినేని రామారావు, సంగీత సారధి రాఘవులు, ఛాయాగ్రాహకుడు సెల్వరాజ్, కళా దర్శకుడు జి. వి. సుబ్బారావు చేసిన కృషిని ప్రేక్షకులు మెచ్చుకొంటారు. ఈ చిత్రం 'నెగెటివ్' ధర యిరవై లకారాలను దాటేట్టు వుంది. ఈ చిత్రానికి సుబ్బారావు, ప్రసాద్ నిర్మాతలు. మంజుల, చంద్రకళ, సత్యనారాయణ, రాజబాబు, గిరిబాబు, రమాప్రభ ప్రధాన పాత్రధారులు.

## ఆగస్టు 15 న తిరపతి దర్శనం

ప్రసాద్ ఇంటర్నేషనల్ ప్రారంభించిన "తిరపతి" చిత్రం ఆగస్టు 15 న ప్రేక్షకులను దర్శించడానికి నిర్ణయించాడు, తిరపతిగా హాస్యానికి పతిగా వెలుగుతున్న రాజబాబు నటిస్తున్నాడు. నవ్వే ప్రతి హృదయంలో విషాదం దాగివుంది అనెడి నిజాన్ని, చెప్పే పాత్రగా తిరపతి సృష్టించబడింది.

వంచనకు దాసోహం చేస్తున్న యీ సమాజంలో మంచికి, మానవతకు విలువ లేదా? అనెడి సమస్యను పరిష్కరించే కథయే "తిరపతి" దీనికి దాసరి నారాయణరావు సారధి. వీరమాచనేని ప్రసాద్ నిర్మాత. ఈ చిత్రంలో హాస్య నటు లందరితోబాటు సత్యనారాయణ, గిరిబాబు, రావు గోపాలరావు, మురళీమోహన్, జయసుధ, కె. విజయ ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు.

## అబ్బో వాణిశ్రీ

గోపీకృష్ణా మూవీస్‌వారి వర్ణ చిత్రం "కృష్ణవేణి" చూచిన తరువాత, ఆంధ్రుల అగ్ర నటిని ఏమని వ్రాసినా, తక్కువే అవుతుంది. క్వీన్ ఆఫ్ యమోషన్స్ అంటే సరిపోతుంది. చిత్రంలో ఆమె ముందు ఎవరూ ఆగలేకపోయారు.

శృంగార నాయికగా ఎంత హుషారుగా చేసిందో, అభాగ్యరాలిగా ఎంతో అద్భుతంగా చేసింది. పిచ్చిపట్టిన కృష్ణవేణిగా వాణిశ్రీ ఆ పాత్రలో పరకాయ ప్రవేశం చేసినదా అనిపించింది.

నాయకుడికి పని తక్కువ. కానీ, కృష్ణంరాజు వున్నదానిని వుత్తమంగా చేశాడు. ముఖ్యంగా శృంగారపు దృశ్యాలలో అందంగా కనిపించి, నాచురల్‌గా చేశాడు. సహాయ పాత్రధారులు గుమ్మడి, అంజలీదేవి, రాజబాబు, రమాప్రభ. నిర్మల, రావుగోపాలరావు, మాడా, సారధి, మంజుభార్గవి మోతాదు మించకుండా నటించారు. "మంచివాడు" తరువాత వస్తున్న మధుసూదనరావు చిత్రం యిది. ఇది విక్టరీని తెచ్చిపెడుతుంది. నటుడు కృష్ణంరాజు సమర్పించు ఈ చిత్రానికి గోపీ నిర్మాత.

## జయసుధకు ప్రమోషన్

సత్యా ఎంటర్ ప్రైసెస్ నిర్మించిన "ఆడపిల్లల తండ్రి" చిత్రంలో జయసుధ వుప నాయికగా నటించింది. రాజబాబు ప్రక్కన హుషారుగా నటించింది. ఆమె నటనను అందరూ మెచ్చుకోవడం జరిగింది. తత్ఫలితమే —

సత్యా ఎంటర్ ప్రైసెస్ తలపెట్టిన రెండవ చిత్రంలో జయసుధకు నాయిక వేషం లభించింది. ఈ చిత్రానికి ఆడపిల్లల తండ్రి దర్శకుడు వాసు నిర్మాత. దర్శకత్వాన్ని ప్రత్యగాత్మ చేపట్టారు.

కథా నాయకుడి పాత్రను పూనా ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌కు సంబంధించిన వ్యక్తికి యివ్వదలచినట్టు నిర్మాత వాసు చెప్పారు.

జయసుధను నాలుగు భాషల నిర్మాతలు కాల్ షీట్లతో వుక్కిరి బిక్కిరి చేస్తున్నారు.



"బంట్రోతు భార్య"లో శ్రీవిద్య, విజయనిర్మల

## ఆచార్య ఆదరణ

ఇటీవల విఠలాచార్యను కలిశాను. అప్పు డక్కడ జి. వి. ఆర్. శేషగిరిరావు కనిపించాడు. ఈసారి పిక్చర్‌కి యీయనే దర్శకుడు, అన్నారు ఆచార్య. జులై నుండి షూటింగు ప్రారంభం అని చెప్పారు.

మరొక చిత్రం ఆగస్టులో ఆరంభం అవుతుందని, ఆ చిత్రానికి వైకుంఠ రామశర్మ డైరెక్ట్

(30వ పేజీ చూడండి)



# తాత-మనవడు

## పి.వి.ఆర్.కుమార్

ఆఫీసునించి యింటికి వస్తూనే, ఉస్సురని నిట్టూరుస్తూ, పడక కుర్చీలో వాలాడు పద్మనాభం. అతడి రాక గమనిస్తూనే లోపలికి వెళ్లిన సరస్వతి, కప్పుతో కాఫీ తీసుకొచ్చి, కుర్చీ పక్కనున్న స్టూలుమీద ఉంచుతూ అంది :

"వేడి చల్లారిపోతుందేమో, పుచ్చుకోండి."

అరమూసిన కళ్లు తెరిచి, ఒక్కసారి ఆ కప్పు వంకా, దాన్లోంచి వెలువడుతున్న ఆవిర్లవంకా, భార్య ముఖంవంకా చూసి, మళ్లీ కళ్లు మూసుకున్నాడు పద్మనాభం. 'తీసుకుంటాలే' అన్నట్లు తలాడించాడు నిస్పృత్తువగా. రెండు చేతుల్నీ పొట్ట మీంచి తీసి, వెనక్కు మడిచి, తలక్రిందుగా అమర్చుకున్నాడు.

అయిదు నిముషాల తర్వాత మెల్లగా లేచి కూర్చుని కప్పు అందుకున్నాడు. కాఫీమీదుగా మీగడల్లే తరక గట్టింది. ముందు దాన్ని తీసి విదిలించాడు చూపుడు వేల్తో. తర్వాత నెమ్మదిగా కాఫీ తాగటం పూర్తిచేశాడు.

గుమ్మంలోనే కూర్చుని బియ్యంలో బెడ్డలు ఏరుతోంది సరస్వతి.

"సూరిబాబేం చేస్తున్నాడే ?" భార్య నుద్దేశించి అడిగాడు. 'ఆడుకుందికి వెళ్లాడంటూ' జవాబు వొస్తుందేమోనని అతడి ఆశ.

"దొడ్లో అరుగుమీద కూచుని చదువుకుంటున్నాడు" అంది సరస్వతి.

"రేయ్, సూరీ !"

పెంకు లెగిరేట్లు పిల్చాడు. ఉలిక్కిపడింది సరస్వతి. పరుగెత్తుకువచ్చాడు సూరిబాబు, తండ్రి ఎందుకంత కేకవేశాడో అర్థంకాక.

"సాయింత్రంపూట, ఆరుబయట గాలో ఆడుకోమని ఎన్నిసార్లు చెప్పాన్నీకు ? అయిదునించి, ఏడుదాకా ఆటలూ, ఏడునుంచి తొమ్మిదిదాకా చదువూ అని చెప్పావా లేదా ?"

బిక్కమొహం వేసుకు, తల్లివేపు చూశాడు సూరి.

"దాని మొహంవంక చూస్తావేం ? జవాబు

చెప్పు. ఇవాళ మీ ఫుట్‌బాల్ మాచ్ ప్రాక్టీసు లేదా ?''

''లేదండి.''

''ఏం ? ఎందుకు లేదు ? రేపేగదూ మీరు ఆడేది ?''

''అవును. కానీ, మ్యాచెస్ యివాళే మొద లయి పోయాయి. అందుకే, గ్రౌండు ఖాళీలేదు. ప్రాక్టీసు లేదు...''

''అందుకని, దొడ్లో అఘోరిస్తున్నావా ? రేపు ఆడవల్సినవాడివి కదా, వాళ్ల మేచ్ చూడాలి, వాళ్లు ఆడే తీరు నేర్చుకోవాలి — అని లేదూ నీకు? మీ టీమ్ వాళ్లెవ్వరూ ఆట చూడటానికి వుండలేదా ? అంతా కొంపల్లోనే తగుల్డ్డారా ?''

తల అడ్డంగా ఆడించాడు సూరిబాబు —

''మరి ? నువ్ మాత్రం కొంప మునిగినట్లు పరిగెత్తుకొచ్చేశావ్. అంతేనా ? ఒకట్రెండు గేములు చూసినకొద్దీ మెలుకువలు తెలుస్తాయి — ప్రతి గేమూ అబ్జర్వ్‌చేస్తూ వుండాలని చెప్పానా లేదా ?''

''కానీ ... అమ్మ ... ఆటలేకపోతే, వచ్చేసెయ్య మని...''

''పొద్దుగూకిన దగ్గిర్నించీ, ముద్ద నోట్లో పడ్డ దగ్గర్నుంచీ కళ్లు కూరుకుపోతాయండీ వాడికి! ఇహ అప్పుడు చదివేదేమిటి వాడి మొహం, నా మొహమూనా ? అక్షరాలన్నీ అలుక్కుపోయి 'సున్నా'ల్లా కనిపిస్తుంటాయి.

అందుకే, ప్రాక్టీస్‌లేని రోజనయినా, శుభ్రంగా స్నానంచేసి కూర్చుని, చదుకోమన్నాను నేనే !''

సంజాయిషీగా అంది సరస్వతి.

''నిద్దరొస్తే, నిలబడి చదవమను. అంతే గానీ, సాయంత్రాలు ఎక్సర్‌సైజా, పాడూ లేకుండా 'ఆడముండ'లా కొంపలో కూర్చుని, చదువుకో మంటావా ?''

గయ్ మన్నాడు పద్మనాభం.

పిల్లిలా బయటకు నడిచాడు సూరి.

చేట తీసుకు, విసురుగా లోపలి కెళ్లిపోయింది సరస్వతి.

మళ్లా వెనక్కి జేరగిలబడ్డాడు పద్మనాభం — బయటికి వెళ్లిన కొడుకు వంకే చూస్తూ.

'పన్నెండేళ్ళు దాటినా యింకా అరేళ్ళ వెధవలా వుంటాడు! అన్నట్టే అప్పనారావు [illegible] వాడూ — చీపురు [illegible]! [illegible] రాలేదు, ఖర్మ! [illegible] కదల టాని కయినా [illegible]!

పర్సనాలిటీ రావాలి వాడికసలు, [illegible] టాని క్కులూ తెస్తూ వుంటాడు తను. [illegible] ఖర్మమో మరి, ఎన్ని [illegible], ఎన్ని [illegible]!'

విసుగ్గా కళ్లు మూసుకున్నాడు.

ఆఫీసులో వర్క్ మరీ ఎక్కువైపోయిన రోజుల్లా మనసు అలాగే వుంటుంది పద్మనాభానికి. స్టేట్లో ఏ మూల గేమ్స్ కాంపిటీషన్లు జరిగినా, ఆఫీసులో పని ఎక్కువయిపోతుంది అతడికి.

అతడి సెక్షన్లో యిద్దరు కో-క్లర్కులు స్టేట్ లెవెల్లో ఛాంపియన్లు. ఒకాతను క్రికెట్ ప్లేయ

# తాత — మనవడు

రైతే, మరొకడు టెన్నిస్ ఛాంపియన్.

నెలకి వారం రోజులు 'ప్రాక్టీసు' పేరుతో మధ్యాహ్నం రెండు గంటలకే చెక్కేస్తుంటారు వాళ్ళిద్దరూ.

ఇహ ఆ యిద్దరి పనీ తనే పంచుకు, పూర్తి చేయాల్సి వుంటుంది పద్మనాభం. ఒకట్రెండు సార్లు మొరాయించాడు — తను వాళ్ల పని చెయ్యలే నని. అప్పుడు వాళ్ల ఆఫీసర్ పిల్చి, యిచ్చిన ఉప న్యాసం బతికున్నంత కాలం గుర్తుంటుంది పద్మనాభానికి;

''చూడు పద్మనాభం ! ఆరోగ్యం దేవుడిచ్చే వరమోయ్ ! ఆ వరం అందరికీ దొరికేది కాదు. (నీలాంటి అర్భనాకారులకి ఆ వరం దొరకదు లేవోయ్ అవా ?) ఆరోగ్యవంతుల్లోనూ కొందరే ప్లేయర్స్ కాగలరు. ప్లేయర్సందరూ గూడా 'ఛాంపియన్లు' కానూలేరు — బహుమతులు గెల్చుకోనూ లేరు ! వందల్లో ఒకళ్లంటూ రలాటి శక్తివంతులు. మనం దరం ఛాంపియన్లు కావటం అలా వుంచి, కనీసం ఆ ఆటల పేర్లూ, పద్ధతులూ గూడా సరిగ్గా తెలీవు మనకి ! (తనకి క్రికెట్ కామెంటరీ వినటం చేతకాదనేగా ఆ దెప్పు ?)

అటువంటి ఛాంపియన్లు మన ఆఫీసులో వున్నందుకు మనం గర్వించాలి. ఆ ఆర్ట్ వాళ్లలో వున్నందుకే, మనం వాళ్లని ప్రోత్సహించాలి. నువ్వు మరి, ఆఫ్టరాల్ కాస్త పని సాయం చేస్తూ వాళ్లతో కో—ఆపరేట్ చెయ్యలేవా ?

చాలాసార్లు చూశాను, నువ్వు విసుక్కోవటం ! బీ స్పోర్టివ్ మిష్టర్ పద్మనాభం — డోంట్ బి జెలస్.''

ఒళ్లు మండిపోయినా, అవతలివాడు తన జుట్టు చేత ధరించిన 'అపర శివుడు' కావటాన 'కామ్'గా బయటకు వచ్చేశాడు.

వాళ్లలో ఆర్టుంటే వుండుగాక. వాళ్ల ఆట కారి తనాని కిస్తున్నారా జీతం—పని చేస్తున్నందుకా?

అయినా ఆట లొక్కటే కళలా ? ఆటగాళ్లకి పని గూడా యివ్వకుండా, అంత బ్రాడ్ మైండెడ్‌గా ప్రోత్సాహ న్నందించే ఆ ఆఫీసరే, తన కెందుకు ఎంకరేజిమెంట్ యివ్వడు ?

వాళ్లకి ప్రాక్టీసుందంటే, రెండింటికల్లా పర్మిషనిచ్చి, పంపేస్తున్నాడు.

తనా మధ్య పోటీవేళకి 'నవల' అందించాల్సి వచ్చి, ఒక్క రోజు శలవు పెడితేనే, మర్నాడు మొహం వాచేలా చివాట్లు పెట్టాడు ? తన రచనలకి ఏం ప్రోత్సాహం యిచ్చి దోహదం చేస్తున్నాడు ? క్లబ్ ఫండ్‌తో వాళ్లకి బ్యాట్లూ, బంతులూ కొనిచ్చి, గ్రౌండ్ తయారు చేయించి పెట్టి, సాయపడు తున్నాడే, మరి తనకి కనీసం తెల్లకాయితాలన్నా యిస్తున్నాడా ?

వెధవది, పోయిన నెలలో రెండు వారాల్లో వర సగ్గా రెండు రేడియో ప్రోగ్రాము లుండి, రికా ర్డింగుకి వెళ్లాల్సివచ్చి శలవు పెడితేనే, ''ఆఫీసున్నది మీ పర్సనల్ యాక్టివిటీస్ పోను, మిగతా రోజులు పని చెయ్యటానికా ్కదయ్యా ! అవన్నీ వర్కింగవర్స్ దాటిన తర్వాతే...'' అంటూ అర్ధగంట సతాయించాడు !

అప్పుడేమయిందిటా యీ స్పోర్టివ్ మెంటా లిటీ ?

పైగా, అద్భుత మానసిక చిత్రణా వైచి త్రితో, పండితరంజకంగా తను వ్రాసే కధలూ, వ్యాసాలూ, వచన కవితల్నీ — 'చాదస్తపు రాతలండీ! ఎవళ్లం ట్రై చేసినా రాసి పారేయగలం' — అంటూ విమర్శిస్తాడు చాటుగా వాళ్లదగ్గరా, వీళ్లదగ్గరా!

అది జెలసీకాక మరేమిటో ?

అయినా, ఆయనొక్కడనే కాదు. ఆఫీసు లోనూ, బయటా గూడా అందరూ అంతే !

'ప్లేయర్స్' కున్న గ్లామర్ 'రైటర్స్'కి లేదు గాక లేదు.

అవునుమరి, ఆటగాళ్లకి ప్రతివాళ్ల మాపుల్నీ ఆకట్టుకోగల 'ఫిజికల్ పర్సనాలిటీ' వుంటుంది. రచయితల్లో వుండే, మెంటల్ పర్సనాలిటీ — మాన సిక ధార్ఢ్యత—ని చూడగల జ్ఞాననేత్రం సామాన్యు లకి వుండదు.

అందుకే సామాన్యులకి రచయితల్లోని శక్తి ప్రస్ఫుటంగా కనబడదు.

'ఆ ... ఏముంది ? ఆపాటి 'రాతలు' రాయ గల్గడమూ ఓ గొప్పేనా ?' అని చప్పరించేస్తారు. 'ఆపాటి — అంతకన్న గొప్పవేకూడా, ఐడియాలు నాకూ తడుతూనే వుంటాయ్. వ్రాయాలంటే,






వెధవది, ఓపికుండదు. ఓపికున్నా, తీరికుండి చావదు. పైగా, రైటింగ్ బిజినెస్సంది చూశారూ, గొప్ప బోర్!' అంటూ ప్రగల్భాలు చెప్పకుంటూ కొట్టిపారేస్తారు.

అయితే, ఇతివృత్తాలు తట్టడమనేది రచనలో ఏ పదోవంతు మాత్రమే ననీ, ఆ ఐడియాకు అంద మయిన శైలి సమర్చి, చక్కని కథనంతో వన్నె తెచ్చి, ప్రారంభం — ముగింపూ ఆకర్షణీయమైన ఫ్రేమ్‌లా తీర్చి, పాఠక రంజకమైన రచన చేయటం అంత తేలికైన విషయం కాదనీ, తామెన్నోసార్లు భావాల్ని భాషలోకి అనువదించే ప్రయత్నంతో కలం పుచ్చుకు కూర్చునీ, రెండు లైన్లయినా రాయక ముందే కలం సాగించే హఠం భరించలేక, దాన్ని జయించలేక లేచిపోతుంటామనీ—ఎవ్వరూ గుర్తుకు తెచ్చుకోరు. గుర్తించినా, బహిరంగంగా అంగీక రించరు!

ప్చ్ ... సామాన్య జనుల విషయం వదిలేసి, కళానిలయులైన ఏ సినిమాతారల విషయమో తీసు కున్నా, తమకింత గ్లామర్, ఖ్యాతి కల్పించినవీ, కూడు పెడుతున్నవీ, ఎవరో మేధావులు చేసిన రచనలేననీ, వారు సృజించే పాత్రల కార్బన్ కాపీలే తాము ధరించే వేషాలనీ కనీస కృతజ్ఞతైనా రచయితలపట్ల చూపరు. వాళ్లేదో, తమ దయ మీద ఆధారపడి బ్రతుకుతున్నట్లు తలుస్తారు.

మళ్లీ ఈ ఆడ తారలకి ప్లేయర్లంటే ఎంత మోజో! ఫలాని క్రికెట్ ప్లేయరంటే నేను పడి ఛస్తాను — ఫలాని హాకీ ఆటగాడు నా మానసిక ప్రియుడు — అంటూ ప్రకటనలు!

లోకమే అంతయినందుకు, తనని తాను నిందించుకోవాలి — ప్లేయర్ కానందుకూ—రచయిత ఐనందుకూ! అంతేతప్ప, ఆఫీసర్నో, కొలీగ్స్‌నో, ఇరుగు పొరుగునో, యిల్లాలినో తిట్టుకునేం లాభం?

'అసలింతకూ మూలం తన తల్లి! ఆడ పెంపకం మూలాన్నే తనిలా 'మఫ్'లా తయా రయ్యాడు!

అదే తన తండ్రి బ్రతికుండి, ఆయన చేతిలో తను పెరిగుంటే యిలాగయ్యేవాడేనా...'

ఆలోచనలకి అక్కడితోటే ఫుల్‌స్టాప్ పెట్టెయ్యాల్సి వచ్చింది, సరస్వతి కేకతో పద్మ నాభానికి.

"అలా బజార్లోకెళ్లి కూరలేవన్నా తెస్తారూ కాస్త? పొద్దున్నా కూరముక్కల్లేక, దొడ్లో తోటకూర మొక్కలు నాలుగూ పీకి..."

"అబ్బ! భారతం చదవకే! ఆ సంచిలా పడెయ్." అంటూ లేచాడు. నిస్పత్తువగా సంచీ అందుకుని, కాళ్ల చెప్పుల్లోకి పోనిచ్చి, బయటికి అడుగువేశాడు.

'వెధవ! నూరిగాణ్ణి పంపినా పోయేది! ఇప్పుడు మైలుదూరం నడవాలి మార్కెట్టుకి' — అనుకుంటూ.

పద్మనాభానికి చిన్నతనంలోనే తండ్రి పోయాడు. పెద్ద కొడుకు కావటం మూలాన తల్లికి అతడే ఆసరా కాక తప్పింది కాదు. తన పెంపకంలో ఎక్కడ లోటొచ్చిపోతుందో, ఎక్కడ కొడుకు చెడు సావాసాలకి మరిగి, తనకి తను కాకుండా పోతాడో నని ఆవిడ అహర్నిశలూ తపన పడేది. డిసిప్లిన్ పేరిట అతి కఠినంగా ప్రవర్తిస్తూ, 'యమచెర'లో పెంచింది పిల్లల్ని అందరినీ — ముఖ్యంగా 'త్వరలో పైకి రావాల్సినవాడూ, మిగతా తోబుట్టువులకి మార్గ దర్శకుడు కావాల్సినవాడూ' — అయిన పద్మనాభాన్ని.

సాయంత్రం బడి వదలటంతోటే, ప్లే గ్రౌండ్‌లో చేరి చీకటి పడేదాకా ఆట లాడుకునే వాళ్ల తోటి పిల్లలంతా. అతడు మాత్రం బడి వదిలిన పది నిముషాల్లో యిల్లు చేరకపోయాడా బడితపూజ తప్పేది కాదు తల్లి చేతుల్లో — ఎలిమెం టరీ స్కూల్లోనే కాదు — ఆ పరిస్థితి — హైస్కూలు వచ్చినా మారింది కాదు.

స్కూలు విడవగానే యింటికి వచ్చి, తల్లి ఏమైనా పెడితే తిని, కాళ్లూ చేతులూ శుభ్రంగా కడుక్కుని, తమ్ముళ్లనీ, చెల్లెళ్లనీ కూర్చోబెట్టుకు చదువు కుపక్రమించేవాడు.

రాను రాను ఆ రకపు జీవితానికే అలవాటు పడి పోయాడు పద్మనాభం.

'ఆటల్లో పడితే ఏ చెయ్యో, కాలో విరగ్గొట్టు కుంటే చచ్చే చావు' కొస్తుందన్న భయం కొద్దీ




ఆటల్లో చేరనివ్వకపోయినా, సాయంత్రాలు ఏ లైబ్రరీ నించో కథల పుస్తకాలో, పత్రికలో తెచ్చుకు చదువు కొంటుంటే మాత్రం ఏం అనేది కాదు ఆవిడ. దాంతో, కాలక్షేపానికి పుస్తకాల నాశ్రయించడం బాగా అలవాటై పోయింది పద్మనాభానికి.

హైస్కూల్లో, సాహిత్య — సాంస్కృతి కోర్స వాల్లో పైచెయ్యి సంపాదించుకోగలిగాడు తద్వారా. వ్యాసాలు వ్రాయటమూ, వుపన్యాసా లివ్వటమూ బాగా అలవడ్డాయి. క్రమేపీ, హైస్కూలు మేగ జైన్లకీ, సావనీర్లకీ, కథలు కూడా వ్రాయటం మొదలు పెట్టగలిగాడు — చిన్న చిన్నవి.

మెల్లగా సాహితీ రంగంలో పరిజ్ఞానం కలిగింది కొంతగా.

అయినా, హైస్కూలు రోజుల్నించీ, 'ఆటగా ళ్లయిన' తోటి విద్యార్థుల డామినేషన్ అతడిమీద బాగా వుండేది! వాళ్లు జిల్లా స్థాయిలోనూ, రాష్ట్ర స్థాయిలోనూ, 'గ్రిగ్' పోటీలనీ, అవనీ, యివనీ ప్రతి ఏడూ రెండు మూడు ట్రోఫీలు — హైస్కూలు ఖర్చుతో తిరిగి వచ్చేవాళ్లు.

వాళ్లు ఏదో ఒక బహుమతి గెల్చుకొచ్చిన ప్రతిసారీ, స్కూలు స్కూలంతా సంబరాలు జరిగేవి. వాళ్లు తెచ్చిన ఆ షీల్డులూ, కప్పులూ పుచ్చుకుని స్కూలు పిల్లలంతా, వూరు వూరంతా వూరేగే వాళ్లు! హీరోల్లాగా బోర విరుచుకు నడిచేవాళ్లు— ఆ ఊరేగింపు ముందర, ప్లేయర్సంతా.

పద్మనాభానికీ చాలాసార్లు జిల్లా స్థాయిలోనూ, రాష్ట్ర స్థాయిలోనూ వక్తృత్వ, వ్యాసరచన పోటీల్లో బహుమతులు వచ్చాయి. కానీ, ఆ బహు మతులు గెల్చుకున్నప్పుడు ఆతణ్ణి హెడ్‌మేష్టరూ, తెలుగు మేష్టరూ తప్ప మరెవ్వరూ అభినందించిన పాపాన పోలేదు! హెడ్‌మాష్టారు కూడా, ఉదయపు ప్రార్థనా సమావేశంలో బహుమతి వచ్చిన విషయం ప్రకటిస్తూ, ఒక నిముషం సేపు అభినందించే వాడంతే!

'ఊరేగింపులూ, పూల దండలూ లేకపోతే మానె — నలుగురు విద్యార్థులూ, ఉపాధ్యాయులూ పొగడకనన్నా పోయిరి' అనుకుంటూ చాలా చిన్న బుచ్చుకోవల్సి వచ్చింది ఆ పసి మనసులో అతడు — అలాటి ప్రతి సందర్భానా!

'ఛీ! నేనే గనక చిన్నతనం నించీ, ఏ ఫుట్ బాలో, వాలీబాలో ఆడుతూ వున్నట్లయితే, యీ పాటికి ఛాంపియన్ కాకపోయినా, మంచి ప్లేయరన్నా కాకపోయేవాడినా, టీమ్‌లో మెంబరన్నా అయ్యుండే వాడిని కాదా — యీ గతి పట్టకుండా తప్పించుకో గల్గేవాడిని కాదా—' అని తన్ని తాను తిట్టుకుంటూ, తల్లినీ తిట్టుకునేవాడు. అయితే, యింటికెళ్లి చాటుగా ఏడ్చుకుంటున్నప్పుడు, తల్లి చూసి, దగ్గ రకు తీసుకు పలికే వోదార్పు వచనాలు మాత్రం అతడికి కొంతలో కొంత ఉపశాంతి కలిగించేవి.

"చూడు బాబూ! ఎవరు మెచ్చుకున్నా, మానినా, నీ బహుమతులే నిజంగా గొప్పవి. అవి, కేవలం నువ్వు నీ స్వశక్తితో గెల్చుకున్నవి. ఆటల్లో బహుమతులంటావా, పదిమంది పాటుపడగా, పలు పరిస్థితులు తోడుపడగా వచ్చినవి. నీకు అలవాటైన చోట మరో కొత్త వూరివాడు వచ్చి ఆడితే, వాడు తేలిగ్గా ఓడిపోవచ్చు. నీ టీములో ఒకడికి అపూట కాస్త ఓపిక తక్కువగా వుంటే, అవతలి జట్టు సునాయాసంగా గెలవొచ్చు. వాదనతో మోసగించీ గెలవొచ్చు, బలాన్ని ప్రయోగించీ గెలవొచ్చు!

ఏమైనా అది సామూహిక విజయమే!

కానీ, మరి నీది?

నీ బుర్రతో ఆలోచించి, నీ తెలివితేట లుపయోగించి, నీ బుద్ధిబలంతో నువ్వొక్కడివీ గెలుచుకున్న బహుమతి. దానికి 'మేధావుల' మెప్పు ఎప్పుడూ వుంటుంది. నలుగురు క్షుద్రవెధవలు మెచ్చుకోనంత మాత్రాన దాని విలువ దిగజారిపోదు.

అయినా యింతలావు వొళ్లుండటం వాలు చాలా ఆటల్లో గెలవటానికి. ఒళ్లు కావాలంటే తెచ్చుకోవటమూ అసాధ్యం కాదు — వేల రకాల టానిక్కులూ, మాత్రలూ వస్తున్న ఈ రోజుల్లో. అయితే, ఏ డాక్టర్లూ, ఏ మందులూ యివ్వలేనిది— మేధాశక్తి — అన్న విషయం గుర్తుంచుకొంటే, నువ్విలా దిగులుపడవు.

కలమెప్పుడూ, కత్తికన్న గొప్పదే! ఆయుధా లతో వాళ్లు గెల్చుకునే ఆటలకన్నా, కలం వాడి, నువ్వు తెచ్చుకునే బహుమతులే మిన్న!

అంచేత, ఏడవకు. నిరాశపడకు!'"

ఆ మాటలు 'మార్ఫియా' మత్తులా తాత్కాలికోపశమనాన్ని కలిగించినా, మళ్లీ రెండ్రో జులు తిరగ్గానే, మళ్లీ స్కూల్లో అవతలివాళ్ల ప్రశస్తీ, డామినేషనూ పెరగ్గానే, కడుపులో మంట రగిలేది పద్మనాభానికి. ఏం చేయలేక పళ్లు నూరుకు వూరుకునేవాడు.




స్కూలు ఫైనల్లో వుండగా ఏదో తెగింపు గలిగింది. క్రికెట్ టీములో ఓ మంచి ఆటగాడికి, పద్మనాభం రచనలంటే కొంత అభిమానం. అది ఆధారం చేసుకుని, అతడిని బ్రతిమాలి, సంవత్సరికే పోటీల్లో క్రికెట్‌కి కట్టాడు పద్మనాభం. మంచి ఆటగాళ్లున్న టీములోనే స్థానమూ సంపాదించాడు మిత్రుడివల్ల.

ఫీల్డింగ్ చేసినంతసేపూ ఫర్వాలేదనిపించాడు. అవతలి జట్టువాళ్లు కంగారుగూడా తిన్నారు — 'పద్మనాభమూ 'ఆడుతున్నా' దేమిటూ' — అని.

తర్వాత బాటింగ్ వచ్చింది. ఏడెనిమిది రన్స్ సవ్యంగానే తీశాడు. మరోసారి. రన్స్ చేస్తూ మధ్యలో వుండగానే, బాల్ వికెట్స్‌ని సమీపిస్తున్నట్లు అనుమానం కలిగింది. కంగారులో ఎదురుగా రన్ చేస్తున్న పార్ట్నర్ని గుద్దేశాడు! ఇద్దరూ పిచ్ మధ్యలో పడిపోయారు. బాగా దెబ్బలు తగిలాయి.

చివరకు టీము ఓడిపోయింది!

అందరికీ రాయి విసిరే అవకాశం లభించింది! ముక్తకంఠంతో పద్మనాభాన్ని తిట్టారు. అవమానించారు.

"బుద్ధిలేకపోతే, ఎంత స్నేహమయితే మాత్రం వాడినెందుకు సెలెక్ట్ చేసుకున్నార్రా? వాడికేం వచ్చని? బరబరా నాలుగు వాక్యాలు బరికెయ్యటమా క్రికెట్ ఆడటమంటే?" అంటూ దులిపేశారు టీమ్ కెప్టెన్ని.

"చేతగానివాడివి, నీ వ్యాసంగంలో నువ్వుండక, తగుదునమ్మా అంటూ ఆటల్లో ఎందుకు చేరావురా? నువ్వెలాగూ గెలవలేవు — పైగా వాళ్లనీ ఓడగొట్టావుగదరా!" అన్నారు మొహమ్మీదే!

మళ్లీ జన్మలో ఆటలజోలికి పోలేనంతటి అవమానం పాలయ్యాడు పద్మనాభం!

* * *

పెద్దవాడయ్యాడు. విద్యార్థి దశ ముగిసింది. ఉద్యోగస్తుడయ్యాడు. రచయితగా సంఘంలో పేరు వచ్చింది. పెళ్లి చేసుకున్నాడు. భార్య పండంటి యిద్దరు పిల్లల్నీ యిచ్చింది.

అతడికి మాత్రం ఆటలన్నా, స్పోర్ట్సుమెన్ అన్నా మోజు తగ్గలేదు.



వాళ్లని తిట్టుకుంటాడు. 'వాళ్లకన్న తను వెయ్యి రెట్లు గొప్ప' అనుకుంటాడు. కానీ అదంతా ఆత్మవంచనే! అంతరాంతరాల్లో అతడికీ వాళ్లంటే గౌరవమే! తనకీ తనంటే లోకువే!

తను గొప్ప ఆటగాడు కాలేక పోయినందుకూ, అంత పర్సనాలిటీ సాధించలేక పోయినందుకూ వింతే!

* * *

కొడుకు పుట్టినప్పుడే అనుకున్నాడు వాడిని తప్పకుండా మంచి ఆటగాళ్లే చేసి తీరాలని, తనలో తను సాధించలేనిది కొడుకులో చూసుకు మురిసిపోవాలని!

చదువులో అతిశ్రద్ధ చూపేవాళ్లు మంచి ఆటగాళ్లు కాలేరని అతడి నమ్మకం. అందుకే కొడుకుని కేవలం పుస్తకాల పురుగులా కాకుండా, మంచి మార్కులతో పరీక్షలు ప్యాస్ కాగలిగే స్టాండర్డ్‌లో మాత్రమే వుంచాలని అతడి తపన.

అతడి భార్య కివన్నీ తెలియవు. కొడుకు, క్లాసులో ఫస్టున వుండాలని అందరు తల్లుల్లాగే కోరుకుంటుంది ఆమె.

తన భావాలన్నీ భార్యతో విప్పి చెప్పుకోవటానికి పద్మనాభానికి జంకు. ఇదంతా చెప్పుకుంటే, తనలోని రచయితని తనే చిన్నబుచ్చుకున్నట్లవుతుందేమో నని అనుమానం. అంతా విని, తనే బైట పెట్టుకున్న తన ఇన్‌ఫీరియారిటీని చూసి భార్య నవ్వేసి ఎగతాళి చేస్తుందని భయం!

అందుకే అస్తమానూ కొడుకుని 'చదువుకో, చదువుకో' మంటూ శతపోరే సరస్వతిని కసురుకునే వాడే తప్ప, 'యిదంటూ' కారణం చెప్పలేకపోయే వాడు.

"ఇదేం చోద్యమమ్మా? చదువుకోమని కోప్పడాల్సింది పోయి, చదువుకుంటుంటే చివాట్లు పెడతాడీయన" అనుకునేది సరస్వతి.

ఆమెకి తగ్గట్టుగా సూరిబాబుకీ చదువుమీదే ఆసక్తి హెచ్చు. ఆటలాడాలంటే భయం. వయిగుర్లో కలిసి పోటీగా గెంతేపాటి దేహదారుఢ్యం అతడికి లేదు. తండ్రి పోలికే వచ్చింది పర్సనాలిటీ విషయంలో — గాలివేస్తే పడిపోయేలా వుంటాడు!

అయినా పిల్లలకుండే సహజమైన సరదాకొద్దీ అప్పుడప్పుడు ఆటలాడదామని ఉబలాటపడినా, 'కబడ్డీ' ఆడుతుంటే — వీడు కూతకి వెళ్తే చాలు. ఏ చెయ్యో, కాలో పట్టుకు లాగి పడేసేవాళ్లు అవతలి జట్టువాళ్లు. వాళ్లకి సూరిబాబుని పట్టటం ఏ నోరూ, వాయీ లేని కుక్కపిల్లని పట్టినట్టే వుండేది. ఎలకపిల్లని గండుపిల్లులు పట్టుకున్నట్టు ఒడుపుగా పట్టేసేవాళ్లు. వాళ్ల భల్లూకపు పట్టులో వాడికి వూపిరిగూడా చిక్కేది కాదు. పైగా తరుమా క్రిందపడగా, వొళ్లంతా దెబ్బలుకూడా తగిలేవి.

మరోసారి వాలీబాల్ ఆడబోతే, బంతిని కొట్టబోయి ఎగిరి, చెయ్యి బెణికించుకుని వారం దాకా తోమించుకోవలసి వచ్చింది.

అప్పట్నుంచీ ఆటలంటే వెర్రి చికాకు వాడికి. హాయిగా కూర్చుని, వాళ్ల నాన్న వ్రాసిన నవలలో, వాళ్ల అమ్మ చదివే పత్రికలో చదువుకోటమో, క్లాసులో ఫస్టు వచ్చేందుకై పాఠాలు చదువుకోవటమో తేలిగ్గా, సుళువుగా తోచేది.

అయినా, పద్మనాభం వీలుచిక్కినప్పుడల్లా వాణ్ణి కూచోపెట్టుకు, 'స్పోర్ట్స్‌మన్ ప్రతిభల్ని' వివరిస్తూ ప్రోత్సహించే ప్రయత్నాలు చేస్తూ వుండేవాడు. ఎలాగైనా వాడికి ఆటలమీద అభిరుచి కల్గించాలని చూసేవాడు. స్టేడియంలో ఏ స్టేట్ లెవెల్ ఆటల పోటీలు జరుగుతున్నా కొడుకుని వెంటబెట్టుకు వెళ్లసాగాడు.

పద్మనాభానికి నిజానికి చాలా ఆటల పేర్లే తప్ప, కామెంటరీలు వినటంకూడా రాదు.

ఆమధ్య ఓసారి ఇండియాకీ, ఇంగ్లండ్‌కీ మధ్య క్రికెట్ పోటీ మంచి పోటాపోటీగా నడుస్తోంది. ప్రజలందరూ ఆ ఆటమీదే 'కాంసన్ట్రేట్' చేసి నిమిష నిమిషానికీ కామెంటరీ ఉత్సుకతతో వింటున్నారు.

మధ్యాహ్నం ఆఫీసులో, ఎవరో అడిగారు, హడావిడిగా వస్తున్న పద్మనాభాన్ని —

"గురువుగారూ — లేటెస్ట్ న్యూసేమిటి?" అని. ఉత్సాహంగా అన్నాడు పద్మనాభం —

"సాయంత్రం అయిదున్నరకి రవీంద్ర భారతిలో నారాయణరెడ్డిగారి కవితా ప్రసంగం వుందట! యిప్పుడే తెలిసింది—"

మతిపోయినట్టు చూసి, పరిగెత్తాడు అవతలి వ్యక్తి! పక్కనున్న మరో ఫ్రెండ్ అన్నాడు —

"లేకపోతే, పద్మనాభంగారినా క్రికెట్ స్కోర్ అడిగేది? ఆయన కసలు ఆట జరుగుతున్నట్టు గూడా తెలికపోవచ్చు—"

ఛర్రుమంది పద్మనాభానికి. కానీ. నిజానికి అతడికి తెలియదు క్రికెట్ మ్యాచ్ జరుగుతున్నట్టు! అందుకే అవమానంతో మొహం కందిపోగా, తల త్రిప్పకు వెళ్లిపోయాడు.

అటువంటి సంఘటనల్ని సైతం కొడుక్కి వివరించి, 'నువ్వు అటువంటి అవమానాల్ని ఎదుర్కొనే అవస్థలో పడకుండా వుండా' లన్నట్టు చెప్పేవాడు.

విన్నట్లే విని, వెంటనే మర్చిపోయేవాడు సూరిబాబు. అతడికి తండ్రి మాటలకన్న, తల్లి మాటలే ఆచరణీయాలుగా తోచేవి.

* * *

రాత్రి భోజనాలు జరుగుతున్నాయి. తండ్రికీ, కొడుక్కీ వడ్డిస్తోంది సరస్వతి.

"నాన్నా..."

మధ్యలో తలెత్తి మెల్లగా పిల్చాడు సూరిబాబు.

తండ్రి భోజనాల వేళ చల్లగా వుంటాడని తెలుసు వాడికి.

"ఏరా?"

"మరి ... మరి ... రేపు మా స్కూల్లో వ్యాస రచన పోటీయున్నాయి! టాపిక్ యివాళే చెప్పారు... మీరేమన్నా పాయింట్లు చెబుతారేమోనని..."

నట్టుతూ, నట్టుతూనే విషయం బయట పెట్టాడు.

"వ్యాస రచన పోటీలా? రేపేనా? అన్నట్టు

## సినిమా

(25వ పేజీ తరువాయి)



''కృష్ణవేణి''లో వాణిశ్రీ

చేస్తారని ఆయన అన్నారు. ఈ శర్మ ఆచార్య వద్ద కో-డైరెక్టరుగా కొన్ని చిత్రాలకు పని చేసియున్నారు.

రెండు చిత్రాలలో కూడా పెద్ద పెద్ద తారలు వుండబోరని, కొత్తవాళ్ళ చేత పెద్ద వేషాలను వేయించడానికి నిర్ణయించారని తెలుసుకొన్నాను.

వాళ్ల అబ్బాయికి తమిళ చిత్రాల డైరెక్షన్ను అప్పగించారు. చిరంజీవి శ్రీనివాస్ దర్శకత్వం చేసిన మొదటి తమిళ చిత్రం విజయవంతంగా నడిచింది. జూన్ పదిన రెండవ చిత్రాన్ని ఆయన ఆరంభిస్తున్నట్టు తెలిసింది.

ఇవన్నీ గాక అంతా కొత్తవాళ్లతో ఒక జానపదాన్ని నిర్మించదలచినట్టు విఠలాచార్య చెప్పారు.

### ఏది కావాలి?

నీకేది కావాలి? అంటూ వుంగరాల జుట్టున్న, చంద్రబింబం లాంటి ముఖం వున్న, మగసిరి వుట్టిపడుతున్న యువకుడ్ని తన వాలుచూపులతో, ప్రేమ సైగలతో కవ్వించింది, కౌగిలించి ఆనందించింది, ఎగలాడీ ఒకతె.

''రాక రాక వచ్చావు మామ
వేచి వేచి వున్నది భామ
కదిలే అందాలు కావాలా
కదిలించే మధురసం కావాలా'' అంటూ హొయలు వొలకబోసింది. ఆ సుందరాంగుడ్ని తన మేనిలో కలుపుకుంది. ''కట్'' అన్నారు దర్శకుడు ప్రత్యగాత్మ. ఈ హుషారైన ఘట్టం పద్మజా మూవీస్ వారి ''దీక్ష'' చిత్రంలో కనిపిస్తుంది. అందాల సుందరాంగుడిగా ఎన్టీరామారావు, వన్నెల విసనకర్రగా అపర్ణ నటించారు.

పై పాటను కొసరాజు వ్రాయ, పెండ్యాల సంగీతం సమకూర్చ, వాణిశ్రీ జయరాం మధుర మనోహరంగా పాడింది. ''దీక్ష'' కథను ఆర్. కె. ధర్మరాజు వ్రాయ, మాటలను దర్శకుడే సమకూర్చారు. ఈ చిత్రంలో జమున, అంజలీదేవి, పండరీబాయి, రాజబాబు, కె. విజయ, ప్రభాకర రెడ్డి ముఖ్య పాత్రధారులు. కె. కుటుంబరావు నిర్మిస్తున్న ఈ చిత్రం ఆగస్టు 15 న విడుదల.

—శ్రీనివాస్



''పల్లెపడుచు''లో రాజబాబు

## తాత — మనవడు

రేపు సాయంత్రమే ఫుట్‌బాల్ పోటీ కదూ ?''

''అ...వు...ను...''

''మరి వ్యాస రచన ఎన్ని గంటలకి ?''

''సాయంత్రమే నండి...''

''సాయంత్రమే అయితే, వ్యాస రచన కెలా వెళ్తావ్ ? ఆట మానేస్తావా ? సిగ్గులేదూ ?''

గర్జించాడు పద్మనాభం.

మళ్లా నోరెత్తలేకపోయాడు సూరిబాబు.

''రేపా వెధవ పోటీలకేం వెళ్లక్కర్లేదు. ఫుట్‌బాల్ టీములో ఆడితీరాలి. నేనూ వస్తాను చూడటానికి. గేమ్ చెడగొట్టటానికి వీల్లేదు. తెల్సిందా?''

పదుకోబోతూ మళ్లా గుర్తు చేశాడు పద్మనాభం.

* * *

మర్నాటి సాయంత్రం తనుగూడా వాళ్ల స్కూలుకి వెళ్లాలనీ, మాచ్ చూడాలనీ ఎంతో వువ్విళ్లూరాడు పద్మనాభం. కొడుకుని 'గోల్స్' కొడుతుండగా చూడాలని ఎంతో ఆశపడ్డాడు. కానీ, నాలుగు గంటల వేళ ఆఫీసర్ పిల్చి అవసరమైన పని అప్పజెప్పటంతో ఆఫీసులోనే ఆరు గంటలు దాటేయువర్కి వచ్చిందతడికి! తిట్టుకుంటూ బయట పడేసరికి మసక చీకట్లు— క్రమ్ముకున్నాయి !

కాళ్లీడ్చుకుంటూ యిల్లు చేరుకున్న పద్మనాభానికి, వరండాలో ఎదురైన దృశ్యం మతి పోగొట్టి కంగారు పెట్టింది ! విజయ వార్తతో ఎదురౌతాడనుకున్న కొడుకు, మూలుగుతూ మంచంలో పడుకుని కనపడ్డాడు ! పక్కనే కూర్చుని, కన్నీళ్లు తుడుచుకుంటోంది సరస్వతి.

''ఏమైందే ?'' కంగారుగా అడిగాడు భార్యని.

''నా బొంద ! ఏం కావాలో అదే అయింది. 'వొద్దు, వొద్దు నాకు చేత కాదు మొర్రో' అంటుంటే, 'వెళ్లు, వెళ్లు ఆటలాడు పొమ్మ'ని బలవంతాన ముందుకు నెట్టారు మీరు.

సాయంత్రం ఫుట్‌బాల్ మాచ్‌లో ఎవడో చావితన్నాడుట కాలిమీద. మడమచిట్లి ఫ్రాక్చరయిందిట!

అప్పటికప్పుడు ఆస్పత్రికి వేసుకెళ్లి, కట్టు కట్టించి, కొంపలో దింపి, యిదుగో యిప్పుడే అటు వెళ్లారు స్కూలువాళ్లు !

అర్భనాకారి వెధవని పట్టుకుని 'ఆట లాడరా' అంటే ఏం జేస్తాడు పసి వెధవ...?''

ముక్కు చీదేసింది సరస్వతి.

గబగబ వెళ్లి, దుప్పటి తొలగించి కాలివైపు చూశాడు పద్మనాభం. ఆ కట్టు చూసేసరికి ఒక్కసారి గుండె చెదరిం దతడికి.

'అమ్మయ్యో ! సరిగ్గా చీలమండ దగ్గరే ఫ్రాక్చరయిందల్లే వుంది ! ఎంతపాటి ప్రమాదమో ! వీడికి మళ్లీ కాలు సరిగ్గా వస్తుందో,... రా...దో ! ఔనై వూరుకుంటే ? బ్రతికున్నంత కాలం నన్నే తిట్టుకుంటూ , నా ప్రాణాన పడి ఏడవాల్సిన ఖర్మ పట్టదుగదా ! చేజేతులా వాడి జీవితాన్ని పాడుచేసిన వాణ్ణి కానుకదా ! భగవాన్...'

మనసులోనే శతవిధాల దేవుడికి నమస్కారాలు పెట్టుకుంటూ కూలబడ్డాడు అక్కడే పద్మనాభం.

మూడు నెలలు పట్టినా, వందలు వొదిలినా, తిరిగి కొడుకు రెండు కాళ్లా తిరగటం మొదలు పెట్టినవాడు, మనసునుంచి ఏదో పెద్ద బరువు దింపుకున్నట్లయింది పద్మనాభానికి. వాడేదో పునర్జన్మ మెత్తినట్లనిపించిం దతడికి.

ఆ తర్వాత మళ్లీ ఎప్పుడూ కొడుకు దగ్గర ఆటల సంగతి నవ్వులాటక్కూడా ఎత్తలేదు పద్మనాభం. 'తనకా ప్రాప్తం' లేదనుకుంటూ ఓ దణ్ణం పెట్టుకుని, వూరుకున్నాడు.

* * *

''తాతయ్యా ! నేనుగూడా నీకుమల్లే, యింతింత పుస్తకాలు రాసేత్తా...''

కలం పుచ్చుకు, తప్పటడుగులు వేస్తూ వచ్చిన మనవణ్ణి గబుక్కున ఎత్తుకు ముద్దు పెట్టుకుంటూ, చేతిలోని కలం తీసుకు బల్లమీద పెట్టేసి వరండాలోకి నడిచి, ''రాతలు కాదు బాబూ! యిలాచూడు. నీకో చక్కని ఆట నేర్పనా?

అదిగో — ఆ గోడ దగ్గర్నుంచి పరిగెత్తుకుంటూ వచ్చి, పదో అంకె చదివేలోగా నన్ను ముట్టుకోవాలి...''

అంటున్నవాడల్లా, ఫక్కున వినబడ్డ నవ్వుతో పక్కకి తిరిగాడు పద్మనాభం.

భర్తనీ, అతడి ఆరాటాన్నీ చూస్తూ ఫక్కున నవ్వింది అప్పుడే వంట యింట్లోంచి వచ్చినసరస్వతి.

చిన్నబుచ్చుకుంటూ మనవణ్ణి కిందకి దింపేసి, లోపలికి నడిచాడు పద్మనాభం.

ఏమీ అర్థంకాని అతడి కోడలు మామగార్నీ, అత్తగార్నీ చోద్యంగా మార్చి, మార్చి చూస్తూ నిలబడిపోయింది !



సీరియల్

# ...రెండు పువ్వులు

రాధారాఘవ

## 3

(గత సంచిక తరువాయి)

ఈ ఉత్తరం అందాక యింకాట్టే తాత్సారం చేయలేదు మధు. క్షేమంగా ఉన్నట్టు వెంటనే తండ్రికో టెలిగ్రాం కొట్టి, ఆవెంటే ఉత్తరం కూడ వ్రాశాడు.

— ఆలశ్యానికి క్షమించమనీ, పనుల ఒత్తిడి వల్ల ఉత్తరాలు వ్రాయలేకపోయాననీ, తను హాయిగా ఉంటున్నాననీ, తన గురించి, తల్లిని ఏవింతా పెట్టుకోవద్దని చెప్పమనీ, త్వరలో వస్తోన్నట్టూ — వ్రాసి పోస్టుచేశాడు.

మూడు రోజులు ట్రెయిన్లోపడి వెళ్లాలీ అంటే భయంగా వుంది మధుకి. ప్లేన్లో వెళ్దామా అంటే ఉన్న డబ్బంతా ఊడ్చుకు పోతుంది. నెలకు వెయ్యి రూపాయలు సంపాదిస్తున్నా ఉన్నది ఒక్క మనిషే అయినా, మిగిలేది మాత్రం అంతంత మాత్రమే ఎప్పుడూ.

ఇంటద్దె. వంటమనిషికి, కారు మెయింటెనెన్సుకీ, హోటల్స్‌కీ, పిక్చర్లకి—ముఖ్యంగా ఢిల్లీ వచ్చింది లగాయితు ఉలెన్సుకీ డబ్బు నీళ్లలానే ఖర్చయిపోతోంది. దానికితోడు, అతని ఫ్రెండ్సందరూ ఫేమిలీలున్నవాళ్లే పాపం! ఎప్పుడూ డబ్బుకి కటకట లాడుతోన్నట్టే ఉంటారు. అందుకని ఎక్కడ కెళ్లినా, ముందు తనే పర్సు తీస్తూంటాడు. ఇంక మిగిలేదేముంది?

బేంక్‌లో ఉన్న డబ్బంతా లెక్క చూస్తే, కటాకటీగా ప్లేను ఛార్జీలకు సరిపోతుంది.

మరి ఢిల్లీ నుంచి వెళ్తున్నాడాయె. అందులోనూ సంపాదనాపరుడయాక మొట్ట మొదటి సారిగా. తండ్రికి పట్టు కెళ్లకపోతే మానే, తల్లికైనా కనీసం ఒక చీరైనా కొనుక్కెళ్లద్దా?—మళ్లీ అక్కడి కెళ్లాక, ఖర్చులకి ఎదురు యింకా తండ్రిని డబ్బడిగితే ఏం బాగుంటుంది?

ఎంతాలోచించినా, ఏంచెయాలో ఎంతకీ పాలుపోడంలేదు మధుకి

"ఆఁ! అమ్మ నేను పట్టుకెళ్లే చీరకి ముఖం వాచిందేమిటీ?" అనుకున్నాడు మళ్లీ. "నువ్వు కష్టపడి, డబ్బు కూడబెట్టి, చీరతేక పోతే నాకు గడవదా?" అంటూ ఎలాగా కొట్టిపారేయక మానదు.

"ఇంక అక్కడ ఖర్చుల మాటా?—డబ్బు కిబ్బందిగా ఉంటోందని చూచాయగా చెప్తే, ఆవిడే తండ్రితో చెప్పి ఇప్పిస్తుంది" అనుకున్నాడు ఆఖరికి.

ఆ వెంటనే ఉన్న డబ్బంతా తీసి, ముందు ఎయిర్ టిక్కట్ కొనేశాడు.

* * *

సౌత్ నుంచి ఏంకావాలో అడుగుదామని, సుషమాకోసం, రెండు రోజుల్నించి చూస్తున్నాడు మధు. కాని ఎక్కడా ఆ అమ్మాయి దర్శనమే లేదు.

ఆవేళ సెలవు కావడం వల్ల, యింట్లో ఉందోలేదో, అసలేమయిందో చూద్దామని, క్రిందకు వంగిచూశాడు.

లోపల వరండాలో ఉన్న వాష్‌బేసిన్ దగ్గర, సుషమ తల రుద్దుకుంటూ కనిపించింది.

ఒంటిని గులాబీరంగు నైట్ గౌనుంది యింకా. జుట్టంతా షాంపూ నురగ—తెల్లగా యింతెత్తున వ్యాపించి, చూడ్డానికి ఏదో షాంపూ తాలూకు ఎడ్వర్టయిజుమెంటు బొమ్మలా అనిపిస్తోంది. బేసిన్ దగ్గర వంగి, తల పైపు క్రింద పెట్టి, నీళ్లతో కడుక్కుంటోంది. ఇక్కడ యిదో ప్రత్యేకత. తల రుద్దుకోవడం అంటే సాధారణంగా నూనె, నలుగు కుంకుడు కాయలు అంటూ మన పెద్ద వాళ్లు చేసే ఆర్భాటం జ్ఞాపకం వస్తుంది.

మధు చదువుకునే రోజుల్లో, హాస్టలు నించి యింటికి రావడం తరువాయి, ఊళ్లో కొచ్చినట్టు ఎలా తెలిసేదోగాని— "అబ్బాయిగారూ! తల రుద్దుతా" అంటూ ప్రత్యక్షమయేవాడు మంగలి.

"నీకూ, నీ క్షవరానికీ ఒక నమస్కారం గాని, నేను వచ్చేముందే లక్షణంగా చేయించుకొచ్చా. మళ్లీ నాబుర్రకాయను తీసుకెళ్లి నీ చేతిలో పెట్టానూ అంటే— ఈ జన్మకి మళ్లీ వెంట్రుకలు రావు —సొగసైన క్రాపు పోయె" అంటూ ఏడవాల్సి వస్తుంది అనేవాడు మధు.

"ఏంమాటలురా అబ్బాయి? — మన మంగలి సూరన్నకు మటుకు అంత మాత్రం తెలీదనుకున్నావేమిటి? — ఆపురుదుబ్బులా జుట్టూ నువ్వూ, కత్తిరింపేయించుకో" అంటూ తగులుకునేది వాళ్లమ్మ.

"అలా చెప్పండి చిన్నమ్మగారూ! నేనేం పట్నం క్రాఫులు ఎరగననుకుంటున్నారు — మనబ్బాయిగారు — చేయించుకు చూడమనండి. అప్పుడు మన తడాఖా తెలుస్తుంది. ఏమైనా వారొచ్చిందంటే సగం మీసం తీసేస్తా" అంటూ సవాలు కొచ్చేవాడు; మంగలి.

"వాడి మాటలతో ఏమిటి? అదెప్పుడూ ఉన్నదేలే—ఏ గొడవా పెట్టకుండా నీ కొడుకు క్షవరం చేయించుకున్న దెప్పుడూ అంట? ఆ హాస్టల్లో రుద్దుకునేవాడో? పాడో. మనిషి యిల్లూ ఒళ్లూ కూడ దుమ్ముకొట్టుకు పోయాడు—ఒరేయ్! సూరన్నా! బాగా అంటకత్తిరేసి, మరీ రుద్దు. ఇన్నాళ్లు పేరుకుపోయిన మట్టి దెబ్బతో కొట్టుకు పోవాలి" అంటూ మద్దత్తు ఇచ్చేది ముసలమ్మగారు.

"ఇంత పెద్దాడివైనా ఇంకా ఏమిటోయ్!

**జరిగిన కథ:** మధు ఢిల్లీలో ఒక పెద్దఉద్యోగి ఆంధ్రుడు. యింటివారి అమ్మాయి సుషమ అతనితో చనువుగా ఉంటుంది. ఆమెకు దక్షిణాది వారన్నా, వారి పిండి వంటలన్నా ప్రీతి యెక్కువ. మధుకి ప్రక్కింటి మిసెస్. సింగ్ కుటుంబంతో పరిచయం వృద్ధి చెందుతుంది. తండ్రి దశరధరామయ్య నుంచి ఒకసారి వచ్చి వెళ్లమని ఉత్తర మొస్తుంది.

బలవంతుడి
చేతిలో
భంగపడిన
అమాయకురాలి
జీవితగాథ!









రామువిజేతా ఫిలింస్

# తులసి

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
కె. బాబూరావు

నిర్మాత
కె.ఎమ్.ప్రభాకర్

లక్ష్మీ ఫిలింస్

సంగీతం: ఘంటసాల. నేపథ్య సంగీతం: ఎస్.రాజేశ్వరరావు కథ: గుల్షన్ నందా. మాటలు: పినిశెట్టి

గొడవ. నోర్మూసుకు కత్తిరింపు వేయించు కోక'' అంటూ వెళ్ళిపోయేవాడు తండ్రి.

ఇన్నాళ్లూ ఎంతో మోజుతో అపురూపంగా పెంచుకుంటోన్న జుట్టూ ఒక్క కత్తిరితో సరి'' తిట్టుకుంటూనే వచ్చేవాడు మధు. ఒకసారి అదంతా జ్ఞాపకంవచ్చి నవ్వుకున్నాడు.

అదే వీళ్లకైతేనా ? ఒళ్లంతా తోము కోవాలనే తపనలేదు. తల స్నానం అంటే, కేవలం తల ఒక్కటే స్నానం చేస్తుందన్న మాట. — చలికాలంలో చాలామంది, ఎన్ని రోజులైనా సరే ఒంటికి స్నానం చేయరు — ఇక్కడి వాళ్లు. తల మాసినట్టనిపిస్తే, తలొకటే రుద్దుకుంటారు.

మధు ఎంతసేపక్కడ నిలబడ్డా, సుషమ అసలు చూడనేలేదు. "ఏంచేయాలా ?" అని ఆలోచనలోపడ్డ మధు, "హాచ్ !" అంటూ గట్టిగా తుమ్మాడు.

అప్పుడు, ఉలిక్కిపడి, తల పైకెత్తి చూసింది సుషమ. పథకం పారినందుకు సంతోషిస్తూ, పైకి రమ్మని సంజ్ఞచేశాడు.

అరగంటలో తయారై పైకొచ్చింది సుషమ.

ంత దూరాన్ని ఆ అమ్మాయిని చూడ

# రెండు పువ్వులు

గానే, "అబ్బ, ఏమందం !" అనుకున్నాడు మధు. ఆవేళ ఒళ్లంతా నిండుగా, మేక్సీ ధరించింది. ఆ సమయంలో, తెల్లని బట్టల్లో ఉన్న సుషమ, కడిగిన ముత్యాంలా, విరిసిన తెల్ల గులాబీలా, మల్లెలు రాశి పోసినట్టుగా అందాలు విరజిమ్ముతూ, దేవకన్యలా కనిపిస్తోంది.

విరబోసుకున్న జుట్టులోంచి, షాంపూ ఘుమఘుమలు, ఆ ప్రదేశ మంతా వ్యాపించాయి.

అంధకారాన్ని చీల్చుకుని వచ్చే విద్యుల్లతలా, మెరిసిపోతూ దగ్గరగా వచ్చింది.

"ఏమిటీ ? అంతలా చూస్తున్నారు ?" అంది నవ్వుతూ.

"నీలో ఉన్న అందాన్ని.

— మల్లెల్లో ఉన్న సౌకుమార్యాన్ని, వెన్నెలలోని సొగసుని, పాలల్లోని తెల్లదనాన్ని, గులాబీల్లోని అంద చందాలనీ రంగరించి, యీ అందాల రాశిని తయారు చేశాడా, ఆ భగవంతుడు ? అనుకుంటున్నాను."

అర్ధ నిమీలిత నేత్రాలతో, ఏదో లోకం లోంచి మాట్లాడుతోన్నట్టుగా, మాట్లాడున్న మధుని చూచి, కిసుక్కున నవ్వింది సుషమ.

"ఏమండోయ్ ! రావుగారూ ! ఏమిటో కవిత్వం చెప్తున్నారీవేళ. మీ మాటలు నాకేం అర్థం కావడంలేదు. తమరు కొంచెం సేపు ఊహాలోకాల్లోంచి భూమ్మీదకు దిగివస్తారా ? ... కొంపదీసి, కొంచెం డోసుగాని పుచ్చుకున్నారా ఏమిటి? అలవాటు లేనిది కదూ?— పైత్యించి ఉంటుంది" అంటూ కిలకిలా నవ్వింది.

వెన్నెలలు జాలువారుతోన్నట్టుగా ఉంది ఆ నవ్వు.

చటుక్కున వాస్తవంలోకి వచ్చిన మధు, సిగ్గుపడి, మామూలుగా అయాడు. "ఛ. ఛ. అలాంటిదేంలేదు" అన్నాడు కంగారుపడుతూ.

అదేం గమనించనట్లుగా, "ఎందుకు పిలిచారు ? చెప్తారా ? వెళ్లిపొమ్మంటారా ? రేపునాకు టెస్టుంది కూడా—ఇంకా ప్రిపేరవ లేదు" అంది.

"ఎందుకు పిలిచానో తర్వాత చెప్తాగానీ, కొన్నిటిని చూసి, దూరం నుంచి ఆనందించాలేతప్ప, దగ్గరకెళ్లి ముట్టుకో కూడదట. అలాగా, నీ అందం దూరం నుంచి చూసి తృప్తిపడాలేగాని దగ్గరకొస్తే ... "హాఁ హా !" అంటూ ముక్కు మూసుకున్నట్లుగా అభినయం చేశాడు.

సుషమ కోపంగా మూతి తిప్పింది.

"అలాగంటే, వెళ్లిపోతా నంతే" అంటూ బెదిరించింది.

"ఇంతకూ చెప్పేదుందా ? లేదా" అంది దబాయిస్తూ.

"కోప్పడకు మరీ చెప్తున్నాగా."

మాలో ఒక సామెత చెప్తారులే. "ఇంటి పేరు కస్తూరి వారు-ఇల్లంతా గబ్బిలాయిల కంపు" అని అలాగ, దూరం నుంచి చూస్తే అప్సరసలా మెరిసి పోతున్నావ్. దగ్గరకొస్తే ... ?— అయినా నీ కెన్నిసార్లు చెప్పాను ? ఆ తలతోపాటు ఒంటికి కూడా విముక్తి కల్గించి, పావనం చేసుకోమని."

"పోదురూ, బడాయి. రోజూ ఒంటికి స్నానం చేయాలంటే బోర్. టైమ్ వేస్టు. మీ మద్రాసీ వాళ్లు, అంత తెలుపుండరుగా. ఇంకా ఎక్కడ నలుపెక్కి పోతారో అన్న భయంతో, రోజూ ఒళ్లు అరగదీసుకు తోముకుంటూ స్నానం చేస్తారు. మాకేం అంత



# డాక్టరు సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**ఎ. ఎస్. విజయవాడ.**

సుమారు 1 సం. గా మెడనెప్పితో బాధపడుతున్నాను. చెవి వెనుకభాగం నుంచి మోచేతి వరకు ఎక్కువ సలుపుగా ఉన్నది. చల్లని నీరు తగిలినా నెప్పి ఎక్కువ అవుతున్నది.

★ఈ లక్షణాలు 'సెర్వైకల్ రిబ్' ఉండటాన్ని సూచిస్తున్నాయి. అంటే మామూలుగా ఉండవలసిన 12 ప్రక్క ఎముకలకన్నా మెడమీద (పైకి కనబడదు) ఇంకొకటి ఉండి చేతులకు పోయే నరాలకు వత్తిడి కలిగించటంవల్ల ఇలా నెప్పి వస్తుంది. చల్లని నీరు తగిలినా నెప్పిరావటం 'సింపతెటిక్' నరాలు ఎక్కువగా పనిచేయుటం వలన.

మెడభాగం ఎక్స్—రే తీస్తే ఇది ఉన్నదా లేదా అని తెలుస్తుంది. ఒకవేళ ఉన్నా వైద్య సలహా మీద మందులుగాని, చిన్న శస్త్రచికిత్స చేయుటంవల్లగాని, వెంటనే నయమవుతుంది. భయమేమీలేదు.

**ఆర్. కె. — నాగవరం.**

నాకు చేతులు ఎప్పుడూ వణుకుతూ వుంటాయి. అనుకోని విషయం జరిగినప్పుడు గుండె దడ, కాళ్ళు చేతులు వణకటం జరుగుతుంది.

ఈ లక్షణాలు, థైరాయిడ్ గ్రంధి ఎక్కువగా పని చేయుటంవల్ల ఏర్పడవచ్చును. బి. ఎం. ఆర్. టెస్టు, సీరం అయొడిన్, కొలెస్టరాల్' పరీక్ష చేయించుకోవాలి.

హైపర్ థైరాయిడిసం వున్నప్పుడు వైద్యుల పర్యవేక్షణ క్రింద మాత్రలు వాడాలి.

**ఎస్. ఎస్. — రాజమండ్రి.**

నా వయస్సు 40 సం. లు. 4 సం. రాలుగా కాళ్ల వ్రేళ్ళు నొప్పిగా ఉండేవి. డాక్టర్ల సలహాపై మందులు వాడగా తగ్గి చేతులకు రాగా తిరిగి మందులు వాడగా తగ్గినవి. ఇప్పుడు కాళ్ళ మోకాళ్ళ నొప్పులు, చేతి నొప్పులు ఉన్నవి. ఇన్డోసిడ్ 25 మి. గ్రా. బెటనసాల్ వాడాను. కాని తగ్గలేదు.

పై లక్షణాలు "రుమటాయిడ్ ఆర్త్రైటిస్"ను తెలియజేస్తాయి. ఈ రోగం ఎక్కువగా ఆడవారికి 40 సం. లు పైబడినవారికి రావటం జరుగుతుంది. ఈ రోగాన్ని గురించి వివరంగా దినపత్రిక డాక్టర్ కబుర్లు శీర్షికలో రాబోయే వారాలలో చదవండి.

ఈ రోగం ఉన్నవారు, ఫినైల్‌బ్యుటాజోన్, ప్రెడ్నిసోలోన్ మాత్రలు వైద్యుల సలహాపై వాడవలసి ఉంటుంది. తెల్లవారగానే చేతులపైనా మోకాళ్లపైన వేడినీళ్ల కాపు పెడితే మంచిది.

**కె. ఎస్. ఆర్. — వల్లభాపురం.**

నా కుడి కాలు విరిగి 6 సం. లు అయినది. తుంటిదాకా పూర్తిగా తీసి వేశారు. ఆ భాగంలో దురద ఎక్కువగా వుంది.

కాలు తీసివేసినపుడు కాలుతోబాటుగా కాలి చివర దాకా వెళ్లే నరములు తీసివేయుటం వలన స్పర్శ జ్ఞానము చేరవేసే నరములు ప్రకోపము చెంది ఆపరేషన్ చేయగా మిగిలిన చర్మము మీద దురద ఉన్నట్లుగా భావ మేర్పడుతుంది. దీనికి ప్రత్యేకించి వైద్యము అనవసరం. విటమిన్ "బి" మాత్రలు రోజుకు రెండు వంతున, "హైసిబెక్స్' మాత్రలు రోజుకు ఒకటి వంతున రెండు నెలలు వాడండి.

**డి. ఎస్. - తుంబూరు.**

నేను చెట్టు పై నుంచి పడి 10 సం. లు అయినది. భయపడి ఇంట్లో వారికి చెప్పలేదు. ఇప్పుడు కూర్చుని ఉన్నా బాధగా వున్నది.

ఇప్పటికైనా ఎక్స్—రే తీయించుకొని ఆర్థోపీడిక్ వైద్యులకు చూపించండి.

ఎప్పుడైనా, దెబ్బ తగిలితే వెంటనే వైద్యం చేయించుకొంటే తగ్గే అవకాశం ఎక్కువ. కొన్ని కొన్ని ఏళ్ల తర్వాత బయటపడితే జరగవలసిన హాని జరిగే వుంటుంది. తర్వాత వైద్యం మొదలు పెట్టినా తాత్కాలికమే గాని నిరంతరంగా పోగొట్టగలగటం అసాధ్యమే!

---

శ్రమ పడాల్సిన అవసరం లేదు. చూడండి. నేనెంత తెల్లగా ఉన్నానో!" అంది కొట్టిపారవేస్తూ.

"నిజమే. రోజుల తరబడి, స్నానం చేయకుండా ఉన్నా, పాలలా తెల్లగా ఉండే ఆ శరీరంమీద, మచ్చుకైనా, చిన్న మరక కనిపించడంలేదు"

"నీ రిసెర్చికి మెచ్చి, మేకతోలు కప్పుదామని ఉంది గాని, ప్రస్తుతం దగ్గర లేదు గాబట్టి ఆ ఆలోచన విరమిస్తున్నా. సరే. అసలు సంగతి కొద్దాం. నేను యింటికి వెళ్తున్నా. సౌత్ నుంచి ఏంకావాలో చెప్పు."

"నిజంగా!" ఇంత ముఖం చేసుకుని, కళ్లు విప్పార్చుతూ అడిగింది.

"ఊఁ"

"మరి చెప్పారు కాదేం ? — ఎప్పుడు వెళ్తున్నారు?"

"ఏదీ చెప్దామంటే, తమరి దర్శన భాగ్యమైతే గదా ?— ఎల్లుండే నా ప్రయాణం. అక్కడ్నుంచి ఏంతెమ్మంటావు నీకు?"

"అక్కడ కంజీవరం సిల్కు ప్రసిద్ధిగా. నాకో శారీ తెచ్చిపెట్టరూ ?"

## రెండు పువ్వులు

"ఓ.కె! అంతేనా ? మరింకేమైనా కావాలా ?"

"అప్పుడు మీరు, మా యింట్లో కొచ్చిన క్రొత్తలో, మదరాసీ ఆచార్ యివ్వలేదూ నాకు ?—పేరు మర్చిపోయాను.— ఏమిటదీ ? అదే—ఆవ్‌కా ఆచార్ — మీ భాషలో ఏమిటీ అంటారు — ఆవ్ ... ఆ! ... ఆవ్‌కాయ. కరెక్టేగదూ ?"

మధు విరగబడి నవ్వాడు.

మరీ ముఖం ఎర్రబడేంత గట్టిగా, పగలబడి నవ్వేసరికి, సుషమకి ఉడుకు మోత్తనం వచ్చింది. "ఎందు కంత యిదిగా నవ్వుతారు? ఏమన్నాననేమిటీ?" అంది ముఖం గంటు పెట్టుకుని.

"మరి నవ్వరూ ? అమ్మాయిగార్కి తినడం అయితే జ్ఞాపకం ఉందటగాని, పేరు జ్ఞాపకం లేదట పాపం. ఆంకాయా గాదు, తలకాయా గాదు—ఆవకాయ !

"కరెక్టు ! ఆకాయే.— నేనూ ఒక్క అక్షరమేగా తప్పు చెప్పింది ... సరే. ఏదో కాయగాని, ఈసారి మాత్రం చాలా తెచ్చి పెట్టాలి సుమా. మళ్లీ ఎప్పుడూ రావడం ?"

"ఇంకో నెలకి"

"ఏమిటీ? — ఇంకో నెలకా ? అబ్బ. ఏకంగా అన్ని రోజులే !.

"అంటే ?—నా చీరా, పచ్చడీ రావడానికి, ఇంకా అన్ని రోజులేనా ? అనా?"

"పోదురూ. మీరెప్పుడూ అలాగే మాట్లాడ్తారు. మీరు లేకపోతే ఏంతోచదు బాబూ! వీలైనంత తొందరగా వచ్చేయండి. సౌత్‌లో ఏకంగా నెళ్లాళ్లెందుకు ? బోర్ గాని."

మధు నవ్వాడు—సమాధానం చెప్పకుండా.

"ఏం ? జవాబు చెప్ప రెందుకూ ? మద్రాసు అంత గొప్పగా ఉంటుందా ఏమిటి? ఏకంగా అన్ని రోజులు శలవు పెట్టి మహా ఉత్సాహంగా ఉన్నారు."

"నిక్షేపంలా. అందులోనూ స్వంత స్టేటాయె. నేటివ్ ప్లేస్ ఎందుకు బాగుండదు చెప్పు."

"ఇక్కడ కంటే బాగుంటుందా అక్కడ? ఇక్కడైతే తిరగడానికి చక్కగా బోలెడన్ని ప్లేసులు. అక్కడేముంటుంది ? చెత్త !! "

"అవునవును. చెత్తే ఉంటుంది మరి

## రెండు పువ్వులు

ఇప్పటిదాకా ఆ చెత్తే కావాలని ఒప్పు చెప్పా రెవరో."

"ఏదో అక్కడ కొన్ని మంచి సరుకు లున్నాయి గదాని, ఏకంగా అక్కడికెళ్లి ఉందా మంటే ఎవరుంటారు బాబూ! మొన్నీమధ్య మా బాబాజీకి ట్రాన్స్‌ఫరైంది. పై ఆఫీసరుకి కోపమొచ్చి ఏకంగా సౌత్‌కి చేసేడు. దానిని మార్పించే సరికి పెద్దలు కనిపించారు."

"అదే నేనూ చెప్తున్నా ... అక్కడివాళ్లు మనుష్యులు కాదు. అక్కడేం ఉండవు. అదంతా అడివి. అంతేనా? ... ఇళ్లల్లో అద్దెకుండ డానికైతే మద్రాసీలు కావాలిటా! వాళ్ల దోసె, వడ తినడానికేమో బాగుంటాయిటా. ఇంక పచ్చళ్లయితే విడిచేపెట్టరు. కాని ... పాపం! మద్రాస్ ట్రాన్స్‌ఫరంటె మటుకు, మీ నార్త్ఇండియన్స్‌కి పనిష్మెంట్ అనుభవిస్తున్నట్టుగా ఉంటుంది. ఎందుకని? —సౌత్ అనేసరికే అంత ఉలికులికి పడుతూంటారు?"

"నిజమే. మీరన్నది కరక్టే. అందుక్కారణం—బహుశా దూరా భారమనో, లేక లేంగ్వేజ్ ప్రోబ్లమ్ వస్తుందోనన్న భయమయుండొచ్చు."

"ఆ లెక్కని మాకు మాత్రం సమస్య లేదా? మేము అందర్నీ వదులుకుని యింత దూరం వచ్చి వర్కు చేయడం లేదూ? ... భాష కేముంది? నాలుగు రోజులుంటే అదే వచ్చేస్తుంది. మేమందరం వచ్చి నేర్చుకున్న వాళ్లం గాదేమిటి?"

"మీ సంగతి వేరు. మీ సౌత్ ఇండియన్స్ హార్డ్ వర్కింగ్ పెర్సన్స్ అట. అలా అని మా ఫాదర్ చెప్తూంటారు లెండి. అందుకని ఎంతదూరమైనా వచ్చి, కష్టపడి వర్కు చేస్తారు. అయినా మీ వాళ్లకున్నంత విశాల దృక్పథం మాకు లేదేమో?..."

"మీ సౌత్ వాళ్లను పొగిడానుగా. ఇప్పటికైనా యింక విడిచి పెడ్తారా? ... అబ్బబ్బ. చిన్నమాట నోరు జారినందుగ్గాను లాగుతూ కూర్చున్నారు—ఏంమనిషో గాని."

"లాగడంగాదు. ఉన్న సత్యం చెప్పున్నానంతే."

"పోనీలెండి బాబూ. అక్కడే ఎంతో బాగుంటుంది. నే నన్నది తప్పే. ఒప్పుకుంటున్నాగా. నెలేం కర్మ. రెండు నెలలు సెలవు పెట్టి ఏకంగా అక్కడే ఉండిపోండి. మీకోసం ఎవరూ తపించి పోవడం లేదిక్కడ."

(ఇంకా వుంది)

---

# వారఫలం

—మహేష్—

## 14-6-1974 శుక్రవారం మొదలు 20-6-1974 గురువారం వరకు

**మేషం :—** అనవసరమైన శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో ప్రయాణాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభించవు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృషభం :—** వృత్తిలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం :—** ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. అధిక వ్యయం జరుగుతుంది.

**కర్కాటకం:—** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు— సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**సింహం :—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో నూతన వ్యవహారాలు లాభిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కన్య :—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలుబాగుంటాయి. అనవసరమైన వ్యయంచేస్తారు.

**తుల :—** వ్యాపారంలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. పోటీవారితో వాద ప్రతివాదాలు తగవు. ప్రయాణాలు ఫలిస్తాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారి పోవచ్చును. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృశ్చికం:—** మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు :—** ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది.దైవ కార్యాలునెరవేరతాయి

**మకరం :—** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కుంభం :—** ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.సాహసికవ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు— సాహిత్య కళారంగాల్లో ఖ్యాతిలభిస్తుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**మీనం :—** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. పోటీవారిలో గౌరవం బాగుంటుంది.రావలసిన డబ్బు అందుతుంది. మీఆలోచనలు ఫలిస్తాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

# అల్లికపని మిరనుకున్నదానికన్న ఎంతో సులభం...

## కోట్సు ఎంకర్ దారాలు మీ అల్లికపనిని అందంగానూ, చిరకాలపు మన్నికతోనూ రూపొందిస్తాయి!



Grant.21.TL

మీరెన్నో అందమైన వస్తువులను—క్రే-సెట్లు, కుర్చీలకు వెనుకవేసేవి, దుప్పట్లు మొదలైన గృహోపకరణములేగాక నేటి ఫ్యాషన్లకు సరితూగే బట్టలు మరియు వాటికి అనుబంధమైనవి ఏవైనాసరే అల్లుకోవచ్చు.

కోట్సు ఎంకర్ దారాలు అనేక శ్రేణులలో వెలిసిపోని ముదురు రంగులలో లభిస్తాయి.

మీరు అల్లినవన్నీ కూడా, ఎన్నిసార్లు ఉతికినాసరే క్రొత్తగానే కనిపిస్తాయి.

మీ అవసరాలకు సరిపడే రకరకాల అద్భుతమైన డిజైన్లు కోట్సువారి నమూనా పుస్తకాలలో లభిస్తాయి. మీరు అల్లిక పనిలో ప్రారంభకులైతే మీకోసం ప్రత్యేకంగా 'లెర్న్ టు క్రోషె' పుస్తకం లభిస్తుంది. ఈ పుస్తకం కొరకు ఈ క్రింది కూపన్ పోస్ట్ చేయడంగానీ లేక నమూనాల పుస్తకాలు మరియు కోట్సు ఎంకర్ అల్లిక దారాలలో మీకు నచ్చిన వాటిని ఎన్నుకునేందుకయితే మీకు దగ్గరలోని ఎంకర్ రిటెయిలర్‌ను గానీ సంప్రదించండి.




దయచేసి మీ 'లెర్న్ టు క్రోషె' పుస్తకాన్ని నాకు పంపండి. దీనితో పాటు రూ. 3/- విలువగల పోస్టల్ ఆర్డర్ జతపరుస్తున్నాను.

పేరు ______________________

అడ్రసు ______________________

J & P Coats (India) Private Ltd.
Advertising Section, 81 Palton Road, Bombay 400 001

**ఎంకర్**
క్రోషె దారం, ఉత్పత్తిదారులు

**కోట్సు**
*ఉత్తమమైన దారములను ఉత్పత్తిచేయువారు*

# మతి పోగొట్టుకున్న మనిషి

(18వ పేజీ తరువాయి)

పోయింది. దెబ్బతిన్న బెబ్బులిలా అమాంతం మీదికురికి దాన్ని జుట్టుపట్టుకు లేవనెత్తాను.

"అకస్మాత్తుగా జరిగిన యీ సంఘటనకు ఇద్దరూ బెదిరిపోయ్యారు. నన్నంతకోపంలో వనజ ఎప్పుడూ చూళ్లేదు కాబోలు భయంతో గజగజ లాడిపోతూ నిల్చుండి పోయింది. 'పూఁ —ఇంటికి పద!'అని హుంకరించాను. వనజ మారుమాట్లాడ కుండా తలొంచుకుని ఇంటికేసి బయలుదేరింది.

"తీరా ఇంటికి వెళ్ళాక గదిలోకి తీసుకెళ్ళి తాటి బరికెతో ఒళ్ళుహూనంచేసి నా కోపం చల్లార్చు కున్నాను. తెల్లవారేసరికి వనజ ఒళ్ళు తెలీకుండా పడివుంది. జ్వరంతో ఒళ్ళుకాలిపోతోంది. వెంటనే డాక్టరుకి కబురంపాను. డాక్టర్ వచ్చిచూసి,అమ్మాయి భయపడిందనీ, మరేమీ భయపడ నవసరం లేదనీ వాళ్ళమ్మకు ధైర్యంచెప్పి ఏదో ఇంజక్షన్‌నిచ్చి వెళ్ళి పోయ్యారు.

"మరుసటి రోజు జ్వరం తగ్గింది. కాని మామూలు మనిషి మాత్రం కాలేదు. ఎవరితోనూ మాట్లాడేది కాదు. ఏదోతలుచుకుని వున్నట్టుండి. బావురుమనేది. కుమిలి కుమిలి ఏడ్చేది. ఎవరెంత వోదార్చినా ప్రయోజనం కనిపించలేదు.

"రెండు రోజులు గడిచిపోయినయ్. ఒక నాటిరాత్రి మాంచి నిద్రలో వుండగా మా యావిడ నన్ను నిద్రలేపి "అమ్మాయి మంచం మీద కని పించడంలేదని చెప్పింది కంగారుగా. పక్కమీంచిలేచి, హరికేన్ లాంతరు వెలిగించుకుని, జీతగాడు రాముణ్ని నిద్రలేపాను. ఇద్దరం బయలుదేరి దొడ్డీ, వాకిలీ అంతా గాలించాం. అనుమానమున్న చోటుల్లా వెతి కాం. కాని వనజ ఎక్కడా కనిపించ లేదు.

"ఎందుకయినా మంచిది, వో మాటు రెస్ట్ హౌస్‌దాకా ఎల్లొద్దాంరండి బాబయ్యా!అన్నాడు రాముడు, మూలనున్న చేతికర్ర చేతిలోకి తీసు కుంటూ. ఇద్దరం బయలుదేరి ఇక్కడికి చేరు కున్నాం. బైటతలుపుమూసివుంది. కాని లోపల దీపం వెలుగు తోంది. ఎవరో మాట్లాడుకుంటున్న చప్పుడు !

"రాముడు తలుపు తట్టాడు. కాని ప్రయో జనం కనిపించలేదు. తలుపు తెరుచుకోలేదు సరి కదా లోపల మాట్లాడు కుంటోన్న చప్పుడుకూడా ఆగిపోయింది. వనజ లోపల వుందన్న విషయం రూఢయింది.

"రాముడికి తిక్కరేగింది. వాడసలే మొరటు వెధవ! వాడికి తిక్కరేగితే దేవుణ్నికూడా లెక్క చెయ్యడు. "హోయ్! ఆఫీసరూ! మర్యాదగా తలుపు తెరుస్తావా,తలుపువిరగ్గొట్టి లోపలదూరమన్నావా?" అని అరిచాడు. వాడి గొంతుక వినేసరికి ఆ కుర్రా ఫీసరు గుండెలు జారిపోయాయి కాబోలు. తిన్నగా వచ్చి తలుపు తెరిచాడు. తలుపు తెరవగానే ఇద్దరం సింహాల్లా లోపలికి దూరాం. తలుపు తెరచిన కుర్రాఫీసరు దిక్కుమొహంవేసి నిల్చుండిపొయ్యాడు. వో మూల నక్కినిల్చుని వున్న వనజను జుట్టు పట్టుకుని బైటకు లాక్కొచ్చాను.

"నీకు ప్రాణాలమీద తీపుంటే పొద్దుపొడిచే లోగా ఇక్కడ్నుంచి వెళ్ళిపోవాలి! మళ్ళీ నీతల యీ పరిసరాల్లో కనిపించిందో దేవుడు కూడా రక్షించ లేడు! అర్థమైందా?' అంటూ మీసం మెలేశాడు రాముడు కుర్రాఫీసరు కేసి ఎర్రగా చూస్తూ. పాపం, కుర్రాఫీసరు నీరుగారి పొయ్యాడు.

"కుర్రాఫీసరు రాత్రికి రాత్రే బిచాణా ఎత్తే శాడు. కాని వనజ మాత్రం మామూలు మనిషి కాలేక పోయింది. ఎప్పుడూ గదిలో ఒంటరిగా కూచుని ఏడుస్తుంది. ఎవరితోనూ మాట్లాడదు. ఇష్టముంటే తింటుంది. లేకపోతే అదీలేదు. తిక్క రేగితే తలుపు తెరచుకుని, ఎవరో వెంటబడితరుము తున్నట్టు పడుతూ లేస్తూ పరుగెత్తి ఇక్కడికి చేరుకుంటుంది. మీలాంటి వయసులోవున్న వ్యక్తి కనిపిస్తే కుర్రాఫీసరే అనుకుంటుంది కాబోలు తనవెంట తీసుకుపొమ్మని చేతులు పట్టుకుని బతి మాలుతుంది"అంటూ కళ్ళు తుడుచుకున్నాడు ముసలయ్య. హృదయంలోంచి ఉప్పెనలా పెల్లుబికే దుఃఖాన్ని బలవంతంగా దిగమింగడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తున్నాడు.

పాపం వనజ అతగాణ్ని ఎంతగా ప్రేమిం చిందో! ఎంత సున్నిత హృదయమో ఆమెది! సనాతన సాంప్రదాయాలూ, సాంఘిక దురాచారాలు సున్నిత హృదయాల మీద ఎంతతీవ్రంగా పనిచేస్తాయో ఎంతఘోరమైన అవాంతరాలకు దారితీస్తాయో ఎందుకాలోచించరీ పెద్దలు! తమ పరువుప్రతిష్ఠల్ని కాపాడుకునేందుకు లేతహృదయాలను ఎంతఅమాను షంగా ఖూనీచేస్తున్నారో ఎందుకు తెలుసుకోరీ పెద్దలు! —

బరువుగా నిట్టూర్చాను.

"కులగోత్రాలనీ, పరువు ప్రతిష్ఠల్నీ అవతలకి నెట్టి, ఆకుర్రాఫీసరు ఆచూకీ తెలుసుకుని, ఆయిద్ద రికీ ముడిపెడదామని కూడా ప్రయత్నించాను. కాని అతగాడికి అంతక్రితమే పెళ్ళయిందనీ, ముగ్గురు పిల్లల తండ్రనీ తెలిసింది. ఏం చెయ్యనుబాబూ!' చూస్తూ చూస్తూ దాన్ని ఏ గంగలో తొయ్యను!' ముసలయ్య చెప్పడం మొదలు పెట్టాడు.

"కూతురు మతిపోగొట్టుకుందన్నదుఃఖంతో తల్లి మంచమెక్కింది. వో వేపు మతిపోగొట్టుకున్న కూతురు, మరోవేపు మంచమెక్కిన ఇల్లాలు!ఈ ఇద్దరి మధ్య నలిగి పొయ్యానుబాబూ! వ్యాపారమయినా వ్యవసాయమైనా జీతగాళ్ళమీద వొదిలితే చేతులు నెత్తికొస్తాయని తెలుసు! కాని ఏంచెయ్యను! అంత కంటే ఏం చెయ్యగలను ? డాక్టర్లకీ, మందులకీ సంచులతో కుమ్మరించాను. ఇల్లుగుల్లయింది కాని, ఇల్లాలు దక్కలేదు. మంచమెక్కిన మా లక్ష్మి మళ్ళీ మామూలు మనిషి కాలేదు. నాలుగేళ్ళపాటు నా దగ్గర నానాచాకిరీ చేయించుకుని తనదారి తాను చూచుకుంది. గృహలక్ష్మితోబాటే నాయింటిలక్ష్మి కూడా వెళ్ళిపోయింది. అప్పులవాళ్ళు ఆస్తినిప్పాదీసం చేసుకుని నన్నుబికారిని చేశారు. తలదాచుకొనువూరి పాకకూడా దక్కలేదు. రెక్కాడితేగాని డొక్కాడదు. ముసలయ్య పై పంచెను ముఖానికడ్డు పెట్టుకుని కుమిలి కుమిలి ఏడ్చాడు."

బళ్ళు వోడలవుతయ్. వోడలు బళ్ళవుతయ్. గడిచిన వాళ్లెవరూలేరు. ఎవరు ఎప్పుడెలా తయా రవుతారో చెప్పలేము! —

ముసలయ్య గబుక్కున బెంచీమీంచిలేచాడు. కంగారుగా "అవతల దాని కెలా వుందో! నేను వెళ్ళొ స్తాబాబూ?"అన్నాడు.

"ఇప్పుడేగా ఇంటికెళ్ళింది?అంతకంగారెందుకు?" అన్నాను.

"ఈ మధ్య మరో బెడద కూడావచ్చిపడింది ఇలాంటి సంఘటన ఏదయినా జరిగినప్పుడు ఆఘాత్తా డికి తట్టుకోలేక ఫిట్లొస్తున్నయ్. మాట్లాడుతూ మాట్లాడుతూవిరుచుకుపడిపోతుంది.మాటాపలుకూ లేకుండా గుడ్లు తేలవేస్తుంది. డాక్టరొచ్చి ఇంజక్ష నిచ్చేదాకా మన లోకంలోకి రాదు. ఎలా వుందో! వస్తాబాబు!" అంటూ నా జవాబుకోసం ఎదురు చూడకుండా కంగారుగా హాల్లోంచి వెళ్ళిపొయ్యాడు ముసలయ్య.

గుమ్మందాకా వెళ్ళితలుపుమూసి గడియపెట్టాను. బరువెక్కిన గుండెలతోకుర్చీలో కూలబడి పొయ్యాను. నాకు తెలీకుండానే కళ్ళు మూతలు పడ్డయ్. రెస్ట్ హౌస్ అటెండర్ రాఘవయ్య తలుపు తట్టేదాకా మెలకువ రాలేదు. కుర్చీలోంచి లేచి వెళ్ళి తలుపు



తిరిగాను. రాఘవయ్య కారియర్ పట్టుకొచ్చి టేబుల్ మీద పెట్టి వెళ్లిపొయ్యాడు.

కారియర్ కంటబడగానే ప్రేవులు గోలపెట్ట సాగినయ్. భోజనం పూర్తి చేసి, పది నిమిషాలు రెస్టు తీసుకుని లేచి బట్టలు తొడుక్కున్నాను. రాఘవయ్యను పిలిచి కారియర్ పట్టుకెళ్ళమని చెప్పి తలుపులు మూసి తాళం కప్ప తగిలించి టవునుకేసి బయలుదేరాను.

నేను టవున్‌లో నా పని పూర్తి చేసుకుని తిరుగు ముఖం పెట్టేసరికి సాయంత్రం ఐదు దాటింది. వూరి పొలిమేరలు దాటి కాలువ దగ్గరికి చేరుకునే సరికి వంతెన కవతలి వేపు పచ్చని కొబ్బరితోట కనిపించింది.

ఇదే కాబోలు ఒకప్పటి ముసలయ్య కొబ్బరి తోట ఇక్కడే కాబోలు వనజ తన హృదయాన్ని తన ప్రేమికుడికి అర్పించుకుంది!— అనుకుంటూ నడుస్తున్నాను.

తీరా వంతెన దగ్గరికి చేరుకునేసరికి పిట్ట గోడ మీద కూచుని వున్న ముసలయ్య కనిపించాడు నన్ను చూశ్లేదు కాబోలు. పై పంచె మడిచి తల మీద వేసుకుని విచారంగా శూన్యంలోకి చూస్తూ కూచుని వున్నాడు.

"ఏమిటి ముసలయ్యా? అలా కూచున్నావేం? ఎలా వుంది మీ అమ్మాయికి?" అని ప్రశ్నించాను. అతనికెదురుగా నిల్చుని.

నన్ను చూడగానే లేచి నిల్చున్నాడు ముసలయ్య. కాని నేనడిగిన ప్రశ్నకు జవాబు చెప్పలేదు. ఉన్నట్లుండి బావురుమని ఏడ్చేశాడు.

"ఏమిటి ముసలయ్యా? ఏం జరిగింది?" కంగారుగా ప్రశ్నించాను.

"పొద్దుటినుండి మాటా పలుకూ లేకుండా పడి వుంది. ఏం చెయ్యాలో తోచడం లేదు. చూస్తూ చూస్తూ కన్నబిడ్డని ఎలా చంపుకోవాలో అర్థం కావడం లేదు" అన్నాడు ఏడుస్తూనే.

"డాక్టర్‌కి కబురంపలేదా?"

"లాభం లేదు బాబూ. కబురంపినా ఆయన రాడు. ఇంతక్రితం ఇవ్వాల్సిన పదిహేను రూపాయలూ ఇవ్వలేదని గుర్రుగా వున్నాడు. కనీసం పాతిక రూపాయలైనా కంట పడందే కాలెక్కడు. కూలి చేసుకు బతికే వాణ్ని. పాతిక రూపాయలు ఎక్కడ్నుంచి తేను బాబూ!" అన్నాడు ముసలయ్య. అతని ముఖంలో నిరాశా నిస్పృహలు దోబూచులాడుతున్నాయ్. బారుకెళ్ళి బైటపడితే పచ్చనోటు ఎగిరి పోతుంది. దర్రిద్రుడు పాతిక రూపాయలు పుట్టించలేక కన్న కూతుర్ని ప్రాణాపాయంనుండి రక్షించలేక పోతున్నాడు.

ప్యాంటు జేబులోంచి పర్సు తీసి పాతిక రూపాయలు అతని చేతిలో పెట్టాను. ముసలయ్య పుచ్చుకోలేదు. చేతిని వెనక్కి లాక్కుంటూ, "ఏమిటి బాబూ యిది?" అంటూ నా ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు.

"ఫరవాలేదు ముసలయ్యా! మరేమీ అనుకోకు! ఒకప్పుడు నువ్వు బాగా బతికిన వాడివి. నువ్వు బావున్న రోజుల్లో ఎందరికో యిలాంటి సహాయాలు

## మతి పోగొట్టుకున్న మనిషి

చేసివుంటావు. నీ సహాయమే నిన్నిప్పుడు ఆదుకుంటోందనుకో! ఆలస్యం చెయ్యకు! వెంటనే వెళ్లి డాక్టర్‌ని కలుసుకో! ముందు ఆపాను డాక్టర్‌కి చూపించు!" అన్నాను బలవంతంగా ఆ పాతిక రూపాయలూ అతని చేత బెడుతూ.

ముసలయ్య కళ్లల్లోంచి రెండు అశ్రుబిందువులు టపటప నేల రాలాయి.

"మీ ఋణం ఎలా తీర్చుకోనుబాబూ!" అంటూ పై పంచెతో ముఖం తుడుచుకున్నాడు. "మంచి మనసుతో ఇచ్చిన యీ పాతిక రూపాయలు నాబిడ్డను తప్పకుండా రక్షిస్తుంది బాబూ! వస్తా!" అంటూ అంగలు వేసుకుంటూ టవునుకేసి బయలుదేరాడు.

■ క్షణంలో అతని కళ్లల్లో ప్రతిఫలించిన ఆశా కిరణాల మెరుపుని చూచి తేలిగ్గా వూపిరి పీల్చుకున్నాను. అక్కడ్నుంచి కదిలి తిన్నగా రెస్ట్‌హవుస్ చేరుకున్నాను. తృప్తిగా స్నానంచేసి కారిడార్‌లో వాల్చిన వాలుకుర్చీలో మేనువాల్చి టవున్నుండి పట్టుకొచ్చిన దినపత్రికను తిరగేస్తున్నాను.

### సర్వజ్ఞుడు

—ఆకొండి వెంకటరత్నం.

అతను చాలా గొప్పవాడు
ఊహల జోరీగల గుంపులు
మేధస్సునిండా కలవాడు !
వ్యాసుణ్ణి తలక్రిందులుగా వ్రేలాడదీసి
మసిపూసి పరిహసించడం అతని మతం !
వాల్మీకినికైమాచేసి వడ్డించుకుని
ఆకలితీర్చుకోవడం అతని ప్రగతిపథం !
గతమంతా నిరర్థకమంటాడు—కాని
చెట్టుమీది పిట్టలా
బట్టలులేకుండా విహరించడం
రాతియుగాన్ని మెదడుగానుగలో పిండి
అతను కనిపెట్టిన అతినూతనకెరటం !
కీర్తి కాంతబంధనాలకోసం పరచినజంజాటం!
సర్వజ్ఞత్వపుచొక్కా తొడుక్కొని
గర్వంగా తిరగడం అతనికి తెలుసు.
కాకమ్మకథల పరిమళాలతో
గాలిని కాల్చుకుతినడం అతనికి తెలుసు.
అవును అతను చాలా గొప్పవాడు
రంగస్థలాన్ని వదిలి రాళ్లలో నటిస్తాడు !
ఎగిరేతూరీగ రెక్కలవలె కనిపించకుండా కదిలే
కనురెప్పల చాటునుంచి అవలోకిస్తాడు
కనుకనే అతను
ఏ సుందరదృశ్యాలను తిలకించగలడు ?
నియాగరాల నిర్మల మధుజలాలనుసైతం
భీకర సాగరకెరటాలుగా చూసి
వెన్ను చూపిస్తాడు.
ఐనా—అతను చాలా గొప్పవాడు ! !

"టవునుకెళుతున్నా బాబయ్యా ! హోటలుకెళ్లి కారియరు పట్టుకొస్తా. ఇంకేమయినా కావాలిస్తే చెప్పండి !" అంటూ అక్కడికి చేరుకున్నాడు రెస్ట్ హవుస్ అటెండర్ రాఘవయ్య !

"ఏమీవద్దు ! కాని నా చిన్న పనిచేసిపెడతావా?" అన్నాను పేపరు మడిచి ఎదురుగావున్న టీపాయ్ మీద పెడుతూ.

"చెప్పండి బాబయ్యా !" అన్నాడు రాఘవయ్య

"నీకు ముసలయ్య తెలుసా ?"

"ముసలయ్యా ?" ప్రశ్నార్థకంగా నాకేసి చూశాడు రాఘవయ్య "ఏ ముసలయ్య ?"

"వనజ తండ్రి. . . "

"తెలీకేంబాబూ ? తెలుసు ! మీ కాయనెట్లెరుగుదురా ?" అని ప్రశ్నించాడు.

"ఇంత క్రితం ఎరుగను ఇక్కడికొచ్చాకే పరిచయమైంది ఈ ఉదయమే !"

ఉదయం జరిగిందంతా ఏకరువుపెట్టి ముసలయ్యతో నాకెలా పరిచయమైందో చెప్పాను.

"అలాగా ?" అంటూ అరుగుమీద కూలబడి, గుంజకి జారగిలబడ్డాడు. "పాపం ఆయమ్మని తలుచుకుంటే నా గుండె తరుక్కు పోతుంది బాబయ్యా. గొప్పింటి కోడలై రాణివాసంలో ఉండవలసినపిల్ల! —ముసలయ్య కూడా ఒకప్పుడు బాగా బతికినవాడే బాబయ్యా. తిండికి కష్టపడుతున్నాడిప్పుడు ! కష్టం చేసుకోందే కడుపునిండదు !" బరువుగా నిట్టూర్చాడు రాఘవయ్య.

"అవునట పాపం ! ఇంత క్రితం నేనిక్కడికొచ్చేప్పుడు వంతెనమీద కనిపించాడు. వనజకి ఫిట్సొచ్చాయట. డాక్టర్‌కి చూపించేందుకు డబ్బుల్లేక దిగులుపడి కూచుంటే నేనే పాతిక రూపాయలు చేతబెట్టి డాక్టర్‌కి చూపించమన్నాను"

"నిజంగా నా బాబయ్యా" రాఘవయ్య అరుగు మీంచి క్రిందికిదిగి సంతోషంగా నాకేసి చూశాడు. "మీ పుణ్యం పూరికేపోదు. దేవుడు మీకు మేలు చేస్తాడు. కష్టాల్లో వున్న ముసలయ్యని ఆదుకున్నారు బాబయ్యా !"

"నువ్వు వచ్చేప్పుడో మాటు ముసలయ్య ఇంటిదాకావెళ్లి వనజకి ఎలావుందో చూసిరా రాఘవయ్యా!"

"అలాగే బాబయ్యా ! వెళ్లొస్తా !" రాఘవయ్య కారియర్ తీసుకుని వెళ్లిపొయ్యాడు.

రాఘవయ్య తిరిగి రెస్ట్‌హవుస్ చేరుకునేసరికి ఏడుదాటింది. కారియర్‌ని టేబుల్ మీద పెడుతూ "వనజమ్మ కులాసాగానే ఉంది బాబయ్యా ! డాక్టర్ బాబు సాయంత్రమే ఇంటికొచ్చి ఇంజక్షనిచ్చి పొయ్యాడట !" అన్నాడు రాఘవయ్య.

"అలాగా ?" తృప్తిగా వూపిరి పీల్చుకున్నాను.

"నేను ఇంటికెళ్లగానే నన్ను గుర్తు పట్టికూచోమంది. నేను కూచోగానే నా కళ్లల్లోకి గుచ్చిగుచ్చి చూస్తూ అడిగింది "నిజం చెప్పు రాఘవయ్యా రెస్ట్‌హవుసులో దిగింది మా శేఖర్‌బాబే కదూ ?' అని. కాదని నచ్చజెప్పేసరికి నా తాతలు దిగివచ్చినంత పనైంది. అసలు విషయమేమిటంటే ఆయన కూడా అచ్చు మీలాగే ఉండేవారు బాబయ్యా. మీ వయసే!




* సిఫారసు చేయబడిన అధికతమ చిల్లర ధర (స్థానిక పన్నుల అనుసారం)

# మతి పోగొట్టుకున్న మనిషి

స్త్రితమేమిటంటే ఆయన పేరు కూడా మీ పేరే బాబయ్యా!" అన్నాడు రాఘవయ్య.

నా ఆశ్చర్యానికి అంతులేదు. మనిషినిపోలిన మనిషుండవచ్చు. వయసు కూడా ఒకటే కావచ్చు కాని ఇద్దరిదీ ఒకేపేరు కావడం చిత్రంగానే ఉంది.

"సమయానికి ఆదుకుని వనజమ్మ ప్రాణాలు నిలబెట్టారు. అప్పటికే ఆలస్యమైందని కోప్పడ్డాడట డాక్టరు బాబు. మరింత ఆలస్యం జరిగివుంటే ఏమయ్యేదో! ముసలయ్య మీకు తన కృతజ్ఞతలు చెప్ప మని మరీమరి కోరాడు."

"ఫరవాలేదు రాఘవయ్యా. నే నిక్కడికి వచ్చిన పని పూర్తయింది. ఇంతతొందరగా నాపని పూర్తవు తుందని నేననుకోలేదు. రేపు ఉదయం ఫస్టు బస్సుకి వెళ్ళిపోతున్నాను ముసలయ్య కనిపిస్తే చెబుతావు కదూ ?"

"రేపే వెళ్ళిపోతున్నారా బాబయ్యా ?"

అవునన్నట్టు తలూపాను.

"అలాగే బాబయ్యా ముసలయ్యకి తప్పకుండా చెబుతాను" రాఘవయ్య అక్కడ్నించి వెళ్ళిపోయాడు.

నేను భోజనం ముగించుకుని లైట్స్ ఆపేసి, పక్కమీదికి చేరుకున్నాను.

వనజ ప్రియుడు ముమ్మూర్తులా నాలాగే వుంటా వాడట. నావయసే నట. నేనే తన ప్రియుణ్ణని అను కుంటోంది కాబోలు వనజ. కొంపదీసి ఏ అర్ధరాత్రో వచ్చి తలుపు తట్టదు కదా? తన్ను నావెంట తీసుకు వెళ్ళమని బతిమాలదు కదా ? మామూలు మనిష యితే నచ్చచెప్పవచ్చు! నేనతడు కానని నిరూపించు కోవచ్చు! అసలే మతిపోగొట్టుకున్న మనిషి ....

నాబుర్ర ఆలోచనలతో నిండిపోయింది. ఎంత ప్రయత్నించినా నిద్రపట్టడంలేదు. నిమిషాలు— గంటలు— కాలగర్భంలో కలిసిపోతున్నయ్. పక్కమీంచి లేచి సిగరెట్టు వెలిగించుకున్నాను. రెండుదమ్ములు లాగి సిగరెట్టు పీకని ఓ మూలకి విసిరాను. మెల్లగా కిటికీవద్దకి చేరుకున్నాను.

ఎదురుగా అవుట్ హౌస్ ముందు కుక్కిమంచం వాల్చుకుని నిశ్చింతగా నిద్రపోతున్నాడు రాఘవయ్య.

రాఘవయ్య ఒంటరి వాడు. భార్యాబిల్లల్లేరు. బాదరబందీ లేదు. చీకూచింతా లేనివాడు. ఎంత నిశ్చిం తగా నిద్రపోతున్నాడు !—

నిశ్శబ్దాన్ని ఛిద్ర చేస్తూ గోడగడియారం పదకొండు గంటలు కొట్టింది. మళ్ళీ నిశ్శబ్దం ఆవ రించింది.

వెన్నెని [illegible]— అందెల సవ్వడి— గాజుల గలగలలు !

క్షణక్షణానికి దగ్గరవుతోంది అడుగుల చప్పుడు. గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి.

ఓ స్త్రీ ఆకారం రిక్షాలా వచ్చి నాలుగ్గు ఆగింది. ఆ నాజూకు, ఆ నడక అచ్చం వనజలాగే వుంది. మసక వెన్నెల్లో స్పష్టంగా కనిపించడం లేదు.

ఆ స్త్రీ ఆకారం ఒక్కసారి గుమ్మం కేసి తేరి పారజూచి, గిరుక్కున వెనక్కితిరిగి, అవుట్‌హౌస్ కేసి నడిచింది. మంచంలోంచి రాఘవయ్య లేచి కూచున్నాడు. స్త్రీ ఆకారం ఆగింది. ఇద్దరూ ఏవో రహస్యాలు మాట్లాడుకున్నారు. అవుట్‌హౌస్ తలుపుతెరుచుకుంది. ఇద్దరూ లోపలికి చేరు కున్నారు. మళ్ళీ తలుపు మూసుకుంది.

ఎవరా స్త్రీ ?—వనజేనా ?—వనజయితే రాఘవయ్యతోబాటు అవుట్ హవుస్‌లోకి ఎందుకెళ్ళి నట్టు ?—

రెస్ట్‌హవుస్‌లోంచి బైటపడి, అడుగుమీద అడు గేసుకుంటూ అవుట్ అవుస్‌వద్దకి చేరుకున్నాను. కిటికీ దగ్గర ఆగాను. కిటికీ తలుపులు మూసి వున్నాయ్. లోపల్నుంచి మాటలు వినిపిస్తున్నయ్.

"అయితే, ఆ కుర్రాయన రేపే వెళ్ళిపోతున్నాడన్న మాట!" అంది వనజ.

"ఆఁ ఆఁ లేకపోతే నిజతుకు బైటపడిపోతుందని భయంగావుందా ఏం ?" రాఘవయ్యనన్నాడు "సొంతానికి సువ్వూ మీ అయ్యా కలిసి భలే నాటకం ఆడారే. కుర్రాయన అంతా నిజమే అనుకున్నాడు. నీ ఆయ్యకి నాలిక రూపాయలు కూడా చెల్లించు కున్నాట్టుగా ?"

"నాటకం రగిలి కడితే ఎందుకు చెల్లించు కోడు ? అసలీనాటకానికి సువ్వేకద మావా సూత్ర ధారుడివి ? "అంది వనజ.

ఇద్దరూ నవ్వుకున్నారు. విరగబడినవ్వుకున్నారు

నా బుర్ర గిర్రున తిరిగిపోయింది. నాకాళ్ళ క్రింది భూమి పాతాళానికి కృంగిపోతోంది. ఇప్పుడు మతి పోగొట్టుకున్న మనిషి వనజకాదు !—నేను !—

ఎలాగో తమాయించుకుని, అక్కడ్నించి కదిలి, తిన్నగా రెస్ట్‌హవుస్‌లోకి చేరుకున్నాను.

ఆరాత్రి ఎలాగో తెల్లవారింది. పెట్టెబెడ్డింగూ బైటపెట్టించి, "నేను వెళ్తొస్తా రాఘవయ్యా!" అన్నాను రాఘవయ్య కేసి తిరిగి.

"మంచిది బాబయ్యా, వెళ్ళిరండి!" అంటూ చేతులెత్తి నమస్కరించాడు రాఘవయ్య.

"నేనిక్కడ్నుంచి వెళ్ళేముందు నీకో ముఖ్యవిషయం చెప్పాలి!" అన్నాను.

"సెప్పండి బాబయ్యా" అన్నాడు రాఘవయ్య చేతులు కట్టుకుని సవినయంగా.

"కోటి విద్యలు కూటికొరకే అన్నారు పెద్దలు. పొట్టకూటికోసం వాడు ఏవేషంవేసినా క్షమించవచ్చులోకం. కాని నువ్వు గవర్నమెంటు వుద్యోగివి. పంచభక్ష్య పరమాన్నాలు కాకపోయినా పొట్టనిండా గంజిదొరికే గ్యారంటీ వుంది నీకు. నీలాంటివాడు వేషాలు వేస్తే ప్రభుత్వం నిన్ను క్షమించదు!" అన్నాను, తీక్షణంగా అతని కళ్ళల్లోకి చూస్తూ.

నే నెందుకలా అన్నానో రాఘవయ్యకి అర్థ మైంది కాబోలు గబుక్కున ఒంగికాళ్ళు పట్టేసు కున్నాడు. "క్షమించండి బాబయ్యా! బుద్ధిగడ్డి తిన్నాది!" అంటూ

ఇప్పుడు మతిపోగొట్టుకున్న మనిషి నేను కాదు!— రాఘవయ్య! —

# ఇది చూచిన తదుపరి మీరు మీ జుట్టుకు ప్రొటీన్ కొరత కలిగిస్తారా?



## హెలెన్ కర్టిస్ ద్వారా ప్రొటీన్ కొరతగల జుట్టు కొరకు శుభవార్త.

### ప్రొటీన్—మీ జుట్టుకు అత్యవసర ఆహారం

మీ అమూల్యమైన జుట్టు నిండా ప్రొటీన్, అది ఆరోగ్యంగా ఉండుటకు దానికి ప్రొటీన్ ఎప్పుడూ అవసరమని నిపుణులు అందరూ అంగీకరించారు. కాని వాతావరణం, గాలి, సూర్యరశ్మి, కృత్రిమ పదార్థాలు—డ్రైయర్లు, బ్లీచ్‌లు, క్షారసంబంధమైన సబ్బులు, చెమట మరియు పులుపు నూనెలు వగైరా, మీ జుట్టులోని ప్రొటీన్‌ను శాశ్వతంగా హరించి, దానిని నిర్జీవంగాను, పొడిగాను తయారు చేస్తున్నాయి. ఒక ప్రొటీన్ పోషణ మాత్రమే మీ జుట్టుకు జీవం, ఆహారం మరియు పెరుగుదలను తిరిగి చేకూర్చగలదు.

### టియారా ఎగ్ షాంపూ మీ జుట్టుకు ప్రొటీన్ ఆహారాన్ని అతి సహజ రూపంలో సమకూర్చగలదు

తాజా గ్రుడ్డుతో శాస్త్రీయంగా తయారు చేయబడి, గ్రుడ్డులోని తెలుపు మరియు అత్యవసరమైన అమినో-ఏసిడ్స్, ఎ & డి విటమిన్లు గలిగి, టియారా ఎగ్ షాంపూలోని గ్రుడ్డు ప్రొటీన్ మీ జుట్టుకు ప్రకృతిచే ఉద్దేశింపబడిన జీవం చేకూర్చే సహజ పోషక పదార్థాలను తిరిగి సమకూర్చగలదు. క్రమబద్ధంగా వాడితే, టియారా ఎగ్ షాంపూలోని ప్రొటీన్ జుట్టు ఊడుట, కొనలు చిట్లుటను అరికట్టుటకు సహాయపడి, సహజమై ఆరోగ్యమైన జుట్టు పెరుగుదలను కల్పించగలదు—దానికి మెరుపు, అందం ఆకారం, అభివృద్ధి కలిగించగలదు.

### టియారా ఎగ్ షాంపూ మీ జుట్టు పెరుగుదలను మరియు ఆరోగ్యంగా మెరియుట కల్పించగలదు

ప్రొటీన్ సమృద్ధమైన టియారా ఎగ్ షాంపూ మీ జుట్టుకు ఏ ఇతర షాంపూ కన్నా ప్రయోజనకారి. అది మీ జుట్టుకు క్రొత్త జీవం పోసి, దానికి అమిత మెరుపు, మెత్తదనం ఇచ్చి ఎంతో తేలికగా దువ్వుటకు తోడ్పడుతుంది—ఎంతో అందమైన జుట్టు.



| | |
|---|---|
| ప్రొటీన్ కొరతగల జుట్టు చివరలు చిట్లుతుంది. తేజోవిహీనంగా, నిర్జీవంగా ఉంటుంది. | ప్రొటీన్ పోషణగల జుట్టు కొనలు చిట్లక, సహజకాంతిని నిలబెట్టుకొని, ఆరోగ్యంగా పెరుగుదలతో ఉండగలదు. |

4 సైజులలో దొరుకును.

100 మిలి గాజు బుడ్డి
150 మిలి—పోలి ప్యాక్
200 మిలి గాజు బుడ్డి

ఇంతేగాక క్రొత్త విప్లవాత్మకమైన 70 మిలి విస్పష్టమైన ప్లాస్టిక్ సీసాలో




## టియారా
## ఎగ్ షాంపూ

సమృద్ధియైన ప్రొటీను మీ జుట్టు పెరుగుదలకు, ఆరోగ్యంగా మెరుయుటకు సహకరిస్తుంది

భారతదేశంలో తయారు చేయువారు:
జె. కె. హెలీన్ కర్టిస్ లిమిటెడ్, బొంబాయి-1

ARMS-HC-041-143-TL

దక్షిణభారత్‌కు సోల్ డిస్ట్రిబ్యూటర్లు : మెస్సర్స్ పారీ & కంపెనీ లిమిటెడ్.,

# శుభోదయం

(11 వ పేజీ తరువాయి)

నన్నాళ్ళ ఏ బాధా లేకుండా జీవించటం అసంభవం. బాధల్లో రకాలు వేరు కావచ్చు. ఎక్కువ తక్కువ భేదాలుండొచ్చు. అంతే కాని ఏ బాధా లేకుండా ఏ మనిషీ బ్రతకలేడమ్మా. పెళ్లివల్ల కొన్ని బాధలుంటాయ్. కాదనం. కాని పెళ్లి చేసుకోకపోవడం వల్ల గూడా కొన్ని బాధలున్నాయి. ఈ రెండు బాధల్లో ఏ బాధ గిట్టుబాటుగా ఉంటుందో కామన్ సెన్స్‌గల మనిషి చూచుకుంటాడు... చూచుకోవాలి'' ఈ రకం మాటలు ఓ గంట సేపు చెప్పాడు తండ్రి.

''మీరు ఎన్నైనా చెప్పండి నాన్నా! నేను మాత్రం పెళ్లి చేసుకోను.'' మొండికేసింది వత్సల.

''నీ పెళ్లి గాందే మిగతా పెళ్లిళ్లు ఎలా...!?'' భయభ్రాంతులతో తల్లి అంది.

''వాళ్ల గురించి నాకు తెలియదమ్మా. ఐనా నా పెళ్లికి వాళ్ల పెళ్లికి సంబంధం ఏమిటి? అది ఈ కాలానికి అనవసరంగా కలిపి మాటాడ్తారుకాని...'' చీదరించుకుంది వత్సల.

''అంతే కాదమ్మా! పెళ్లి లేకుండా నువ్వుంటే లోకం ఎన్ని రకాలుగా అనుమానిస్తుంది? నిన్ను. నిన్ను కన్నవాళ్లని, నీ తోబుట్టువుల్ని... నీ కుటుంబానికి ఎంతో అప్రదిష్ట వత్సలా'' తల్లి కంఠంలో ఎన్నడూ లేని దైన్యం కనిపించింది. ఐనా పట్టించుకునే స్థితిలో వత్సల లేకపోవటం వల్ల.

''ఇందరికోసం నేను యోచించాలి గాని నాకోసం నేను యోచించుకోకూడదు. నాకు ఇష్టం లేకపోయినా మీ అందరికోసం నేను పెళ్లి చేసుకోవటం ఏమిటో నాకు అర్థం కావటంలేదు. ఎవరి గురించి యోచించినా ముందు నాగురించి యోచించుకున్న మీదటే గదా. నేనంటూ లేకపోతే లోకమే లేదాయె'' అంది.

తల్లి ఏదో అనబోయింది. అంతకన్నా ముందే తండ్రి ''ఔనమ్మా! నువ్వు చెప్పింది గూడా నిజమే. సరే అలాగే నడుచుకుందాం. మరి రేపు వచ్చే సంబంధం మాట ఏమిటి? తీరా రమ్మని వాళ్లొచ్చాక వాళ్ల ముందు ఇవన్నీ అనుకోవటం బాగుంటుందంటావా?'' అన్నాడు.

(ఇంకా వుంది)












**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**

# సంతోషమే సగము బలము











పల్లవీ ప్రొడక్షన్స్

# అందరూ దొంగలే

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత: అక్కినేని ఆనందరావు

దర్శకుడు: వి.బి.రాజేంద్రప్రసాద్ B.Sc.

మాటలు: ఆత్రేయ-భమిడిపాటి సంగీతం: కె.వి.మహదేవన్ ఫొటోగ్రఫీ: ఎస్.వెంకటరత్నం W.I.C.A. కళ: ఎస్.కృష్ణారావు



అన్నపూర్ణా ఫిలింస్ రిలీజ్

ANNAFURNA